

నేషనల్ గాలరీ (అమెరికా)లోని ఒక ప్రతిమ

ఆంధ్రదేశ మంతటా
ప్రదర్శింప బడుచున్నది



మదరాస్ థియేటర్స్

సర్వాధికారి

తెలుగు
"DICTATOR"

# విషయానుక్రమణిక
## 1951 అక్టోబరు 17

# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిపత్రిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
Founder: K. NAGESWARA RAO

సంపుటము 44
సంచిక 7
17-10-51

ఖర సంవత్సర ఆశ్వయుజ బహుళ తదియ బుధవారము


# అరబ్ దేశాలలో సంచలనం

ప్రథమ ప్రపంచ సంగ్రామం అనంతరం ఒటోమన్ సామ్రాజ్య శృంఖలాల నుండి విముక్తి పొందినా వెంటనే బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పాలబడి, వారి



ఈజిప్టుప్రధాని నహాస్‌పాషా

కుట్రలకు పీడనకు లోనైన అరబ్ దేశాలు, ద్వితీయ ప్రపంచ సంగ్రామం అనంతరం క్రమక్రమంగా బ్రిటిష్ సామ్రాజ్య శృంఖలాలను తెంచుకోగలుగుతున్నాయి. ఎర్ర సముద్ర ప్రాంత మంతటినీ బ్రిటిష్‌వారు తమ అదుపులో పెట్టుకోడానికి రెండు ముఖ్యహేతువు లున్నాయి. 1. పెట్రోలియం సప్లై. 2. కామన్వెల్త్ దేశాలమధ్య రహదారి సౌకర్యం. ఇవే తమ దేశాల రాజకీయ దాస్యానికి హేతువులని అరబ్ దేశాల ప్రజలు గ్రహించారు. అంతేకాదు, ద్వితీయ ప్రపంచ సంగ్రామకాలంలో ఈ దేశాలన్నీ బ్రిటిష్, ఫ్రెంచి సైన్యాల ఆక్రమణకు లోబడినాయి. ఈజిప్టు యుద్ధ సమయంలో ఈజిప్టురాజు ఫరూక్‌ను రాజభవనంలో ఖైదీగా బ్రిటిష్ సైన్యాలు నిర్బంధించినమాటను ప్రజలు మరిచిపోలేదు. ఇంక మరొక ప్రపంచయుద్ధం వచ్చినట్లయితే కొరియాదేశానికి పట్టినగతి తమ దేశాలకు తప్పదని అరబ్ రాజ్యాలు గ్రహించాయి. పాశ్చాత్య సైన్యాలను వెళ్లగొట్టకపోతే, తృతీయ ప్రపంచ సంగ్రామంలో మొదటిదెబ్బ ఈ దేశాలపైనే పడుతుంది. పాలస్తీనా విభజనవిషయంలో జోర్డన్ రాజును అండగా పెట్టుకుని బ్రిటన్, ఇజ్రాయల్‌ను బలపరిచి అమెరికా తమపట్ల ద్రోహం చేశాయని అరబ్ రాజ్యాలు భావించాయి. అందువల్ల ఎర్ర సముద్రప్రాంతంనుంచి బ్రిటిష్‌వారిని వెళ్లగొట్టడానికి అరబ్ రాజ్యాలు తరుణంకోసం వేచి ఉన్నాయి. జోర్డన్ రాజు హత్యతో బ్రిటిష్‌వారికి ఆరాజ్యంలో పలుకుబడి



ఫరూఖ్ మహారాజు

తగ్గింది. జోర్డన్ సైన్యాలకు అధిపతియైన బ్రిటిష్‌సైనికోద్యోగి గ్లబ్ పాషా మెల్లిగా స్వదేశం చేరుకున్నాడు. పర్షియా దేశంనుంచి బ్రిటిష్‌వారు వెళ్ళిపోవడంతో, ఇంక వారు బలప్రయోగం చెయ్యడానికి జంకిపోతున్నారని భావించి ఈజిప్టు ఈ తరుణంలోనే, సూయజ్ కాలువ ప్రాంతంనుంచి బ్రిటిష్ సైన్యాలు నిష్క్రమించాలని పట్టుబట్టారు. 1936 లో చేసుకున్న ఆంగ్లో-ఇజిప్షియన్ ఒడంబడికను, 1899 లో ఆంగ్లో ఇజిప్షియన్ సూడాన్ గురించి జరిగిన ద్వంద్వ రాజ్యాధికారపు టొడంబడికనూ (కాండ మినియమ్) రద్దుపరుస్తూ నాలుగుడిక్రీలను ఈజిప్షియన్ పార్లమెం

(43 వ పేజీ చూడండి)

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

అలెగ్జాండర్ డ్యూమా

## 67

విల్ ఫర్ట్ తన గదిలో ఒంటరిగా కూర్చుని దీర్ఘయోచనలో నిమగ్నుడైనాడు. ఎవరినీ లోనికి రానీయవద్దని పరిచారకునకు ఆజ్ఞాపించి, గది లోగడియ వేసుకుని కూర్చున్నాడు. డ్రాయరు తెరిచి గుప్తకీలకం నొక్కి చిన్న మరుగు అర ఒకటి తెరిచాడు. అందులో ఒక కాగితాలకట్ట తీసి విప్పాడు. తన రాజకీయ జీవితానికి, ద్రవ్య, వ్యాపారాది విషయాలకు, ప్రణయ రహస్యాలకు మిత్రులకు శత్రువులకు సంబంధించిన పత్రాలను తిరగవెయ్య నారంభించాడు. తనకు శత్రువు లెవరెవరున్నారో జ్ఞప్తికి తెచ్చుకున్నాడు.

"ఎవరై ఉంటారు? ఇంత దీర్ఘకాలం నిరీక్షించి, ఈనాడు నాపై పగతీర్చుకోడానికి ఏ శత్రువుకి ఓర్పు ఉంటుంది? ఆనాడు జరిగిన వృత్తాంతాన్ని కార్సికన్ దేశస్థుడు ఒక ఫాదరీకి చెప్పాడు. ఫాదరీ మాంట్ క్రిస్టోకి చెప్పిఉంటాడు. కాని మాంట్ క్రిస్టోకి నన్ను గురించిన ఈ వృత్తాంతం తెలుసుకోవలసిన అగత్యం ఏముంది?"

మరికొంతసేపు ఆలోచించాడు. "ఇంతవరకెన్నడూ ఏ పరిస్థితిలోనూ నాకూ అతనికీ మధ్య వైరానికే అవకాశం లేదే!"

కాని ఈ మాటలలో అతనికే నమ్మకం లేదు. ఏమో! మాంట్ క్రిస్టో, ఎవరో? ఏదో గుప్త సందేహం విల్ ఫర్ట్ హృదయాన్ని కలచివెయ్య నారంభించింది.

ఈ సమయంలో గది వెలుపల మెట్లపైన భారమైన పదసవ్వడి వినవచ్చింది. విల్ ఫర్ట్ పత్రాలను గబగబా దాచి డ్రాయర్ మూసేశాడు. గది తలుపు తెరవగానే సెంట్ మిరాన్ భార్య కనపడింది. దుఃఖం ముంచుకొని వస్తుండగా "నాయనా! ఎంత పని జరిగిందోయ్! నే నింకెలా బ్రతకను? అయ్యో!" అంటూ ఆమె మూలిగింది.

"ఏమిటి? ఏమయింది? మామగారేరి?" అన్నాడు విల్ ఫర్ట్ తత్తరపాటుతో.

"మీ మామగారింక లేరు."

"ఆ!" అని మాత్రం అన్నాడు విల్ ఫర్ట్.

"అవును," అంది సెంట్ మిరాన్ భార్య. "వారం రోజులైంది మేమిద్దరం బయలుదేరి. ఆయనకి ఆరోగ్యం సరిగా లేకపోయినా, వాలంటిన్‌ని చూడాలనే కోరికతో బయలుదేరాం. మార్సెల్స్ దాటగానే ఆయనకి నిద్రపట్టింది. ఎంతసేపటికీ లేవలేదు. ఎంత కదిపినా లేవలేదు. ముఖమంతా ఎర్రబడింది. కణతలపై నరాలుబ్బాయి. తరవాత గంట సేపటికి చూస్తే ప్రాణాలు అంతరించాయి. నేను నిస్సహాయంగా చూస్తూ ఉండిపోయాను."

"మరేం చేశారు?"

"ఇంకేం చేస్తాను? శవం వెనక మరొక బగ్గీలో వస్తోంది. నే నుండలేక ముందు వచ్చేశాను."

"అయ్యో! మీ కీవయస్సులో ఎంత కష్టం వచ్చింది?"

"వాలంటిన్ ఎక్కడుంది నాయనా? ఆమెకోసమే ఇంత తెగించి వచ్చాను."

"ఇప్పుడే వస్తుంది. మీ రిలా రండి. ఇక్కడ విశ్రాంతి తీసుకోండి" అంటూ విల్ ఫర్ట్ ఆమెను చెయ్యిపట్టి సోఫావద్దకు తీసుకువెళ్లాడు. ఆమె సోఫాలో కుంగిపోయింది. కళ్ళవెంట నీరు ధారలుకట్టి ప్రవహించ నారంభించింది. వెక్కి వెక్కి ఏడవ నారంభించింది.

వెంటనే వాలంటిన్‌ని తీసుకురావడానికి విల్ ఫర్ట్ స్వయంగా వెళ్ళాడు. తండ్రిముఖం చూడగానే వాలంటిన్ తత్తరపాటు చెందింది. "ఏమయింది నాన్నా?"

"మీ అమ్మమ్మ ఇప్పుడే వచ్చారు వాలంటిన్" అన్నాడు విల్ ఫర్ట్.

"మరి తాతగారు?"

"విల్ ఫర్ట్ సమాధాన మివ్వలేదు. హీలాయిస్ విల్ ఫర్ట్ వచ్చింది. తండ్రి కూతుళ్ల సంభాషణ విని "ఎంత చిత్రంగా ఉంది! ఏ క్షణాని కేమౌస్తుందో ఎవ రూహించగలరు? అంది."

విల్ ఫర్ట్ దంపతులు వృద్ధురాలిని ఓదార్ప యత్నించారు. వాలంటిన్ దుఃఖాన్ని అణచుకుని వృద్ధమాతను కౌగలించుకొని ఊరడించ నారంభించింది.

మధ్యాహ్నం వాలంటిన్‌కి నయర్ టైర్ వద్దనుంచి కబురు వచ్చింది. కరుణరసభరితమైన చూపులతో వృద్ధుడు మనుమరాలి నూరడించాడు.

"అవును. నా కింకా మరొక తాతగారున్నారనికదా చెప్తున్నారు?" అంది వాలంటిన్.

"అవును" అన్నాయి వృద్ధుని నేత్రాలు.

"అవును - నువ్వే లేకపోతే నాప నేమయ్యేది!"

సెంట్ మిరాన్ భార్య మంచం పట్టింది. జ్వరం ఉధృతంగా వచ్చింది. మరునాటి ఉదయం వృద్ధురాలిని చూసి వాలంటిన్ ఆశ్చర్యచకితురాలయింది. "ఏమిటిది అమ్మమ్మా! ఇలాగున్నా రేమిటి? నీకు బొత్తిగా బాగుండలేదా?"

"లేదమ్మా! కాని నువ్వెప్పుడు వస్తావా అని ఎదురు చూస్తున్నాను. మీ నాన్న కొకసారి కబురు పంపు వాలంటిన్"

వాలంటిన్‌కి ఏమీ అర్థం కాలేదు. తండ్రికి కబురుపంపిన వెంటనే వచ్చాడు. రాగానే వృద్ధురాలిలా అంది. "వాలంటిన్ వివాహం విషయమై కాదూ మీ రుత్తరం వ్రాశారు?"

"అవునండి. దాదాపు ఏర్పాట్లన్నీ పూర్తయినాయి."

"మీ అల్లుడెవరు?"

"ఫ్రాంజ్ డి ఎపినే."

"పూర్వం చక్రవర్తి విరోధిగా ఉన్న నయర్ టైర్ మనుమరాలిని అతను చేసుకుంటాడా?"

అనువాదం: సీతారామ్

"ఆ విరోధాలన్నీ ఇప్పుడంతరించాయండి."

"అయితే ఇంక నే చెప్పవలసింది ఒక్కటే ఉంది. నేనింక ఆట్టే రోజులు బ్రతకను. తల్లిలేని బిడ్డను కనీసం నేనైనా ఆశీర్వదించాలి. ఎంత త్వరలో వీలైతే అంత త్వరలో పెళ్లి చేసెయ్యాలని నాకోరిక."

"మీకోరిక ప్రకారమే జరుగుతుంది. ఫ్రాంజ్ పారిస్ నగరం చేరగానే..."

"కాని అమ్మమ్మా" అంది వాలంటిన్. తండ్రి మాటలోనే ఆగిపోయాడు. "తాతగారు పోయి పదిరోజులైనా కాలేదు. ఇప్పుడు పెళ్ళేమిటమ్మా!"

వృద్ధవనిత గాఢంగా నిట్టూర్చి ఇలా చెప్పింది: "అమ్మా! ఇటువంటి సంకోచాలు పెట్టుకుంటే వీలుకాదమ్మా! ఉన్నవాళ్లు బ్రతికుండగానే అన్నీ నెరవేర్చుకోడం అవసరం"

"అవేం మాటలు?" అన్నాడు విల్ ఫర్ట్ "మీరు త్వరలో స్వాస్థ్యం పొందుతారు. భయపడకండి."

"లేదు. నేనింక బ్రతకను. నే చెప్పేది నిజం. నేను చనిపోయేలోగా ఈ వివాహం జరిగిపోవడం అవసరం."

"మీ రిటువంటి ఆలోచనల్ని మానుకోవాలి."

"కాదు. నువ్వు పొరపడుతున్నావు నాయనా! రాత్రి నాకు బొత్తిగా నిద్ర పట్టలేదు. కన్నులు మూతపడలేదు. ఒక రాత్రి వేళ హీలాయ్ గదివైపు ద్వారంవద్దనుంచి ఒక తెల్లని ఆకారం మెల్లిగా నడిచి వచ్చింది."

"జ్వర తీవ్రత!" అంది వాలంటిన్.

"కాదు. నేను చూసిన మాట నిజం. ఈ గ్లాసు తీసిన చప్పుడయింది. తరవాత మళ్లీ అక్కడే పెట్టడంకూడా నేను కనిపెట్టాను. గంట మోగిద్దామని నేను చెయ్యి చాపేనంతలోనే ఆ ఆకారం అంతర్ధానమయింది. తరవాత పరిచారిక దీపం తీసుకువచ్చింది."

"అయితే పరిచారికకు ఎవరూ కనపడలేదా?"

"ఎలా కనపడతారు? ఆ వచ్చినది నా భర్త అని నాకు తెలుసును. నాకు మాత్రమే కనపడతారు. నా భర్త చనిపోయి కూడా నన్ను చూడగలిగినట్లే, నేను చనిపోయినా నా మనుమరాలిని కాపాడగలను. ఫ్రాంజ్ ఎప్పుడు వస్తాడు?"

"ఈపాటికి వచ్చిఉంటాడు" అన్నాడు విల్ ఫర్ట్.

"అయితే రాగానే నాకు చెప్పండి. మనం తొందరపడాలి. అంతే కాదు. న్యాయవాదిని పిలవండి. నా పేరనున్న ఆస్తినంతా వాలంటిన్‌కి వ్రాసి ఇస్తాను."

"అయ్యో! అమ్మమ్మా! నీకు సంధిపుట్టింది. నువ్వు మాట్లాడకుండా పడుకుని విశ్రాంతి తీసుకో. వైద్యుడికోసం కబురు పంపుతాను."

"వైద్యుడా? అక్కర్లేదు. నాకు జబ్బేమీలేదు. దాహం మాత్రం ఎక్కువగా ఉంది."

"ఏం తీసుకుంటున్నావు?"

"మామూలే. ఆ గ్లాసులో ఉన్నదే తీసుకుంటున్నాను. ఇలా అందియ్యి వాలంటిన్."

వాలంటిన్ ఔషధంతీసి ఒక గ్లాసులోపోసి ఇచ్చింది. రోగి ఒక్క గుక్కలో త్రాగివేసింది.

"పిలవండి. న్యాయవాదిని పిలవండి. తొందరగా" అంటూ ఆమె వెనక్కి వాలిపోయింది. తల అటూ ఇటూ తిప్ప నారంభించింది.

విల్ ఫర్ట్ పరుగు పరుగున వెళ్లాడు. వాలంటిన్ పడకపై కూర్చుని పరిచర్య చెయ్యసాగింది. రెండుగంటల్లో సెంట్ మీరాన్ భార్యకు మగత కమ్మింది. వైద్యునీ, న్యాయవాదినీ తీసుకుని విల్ ఫర్ట్ వచ్చాడు. పిలవగా పిలవగా వృద్ధురాలు పలికింది. వాలంటిన్ గది విడిచి వెళ్లిపోయింది. ఆమె తోట సమీపించగానే ఎవరో పిలిచినట్లయింది. చుట్టూ చూసింది. దూరాన ప్రాకారానికి అవతల మాక్సిమిలియన్ కనపడ్డాడు. వాలంటిన్ ప్రాకారాన్ని సమీపించి "ఇదేమిటి? ఇప్పుడొచ్చావేం మాక్సిమిలియన్?" అంది.

"అవును. ఏం జరిగిందో నీవల్ల వినాలని వచ్చాను. నీ పెళ్ళెప్పుడు?"

"నీకంతా చెప్పేస్తాను. ఇవాళ ఉదయమే మా అమ్మమ్మ కబురు పంపి నా పెళ్లి సంగతి ఎత్తింది. వెంటనే పెళ్లి జరిగిపోవాలని పట్టు బట్టుతోంది కూడా. ఇంక ఫ్రాంజ్ రావడం తడువుగా పెళ్లికంట్రాక్టుపైన సంతకాలు జరిగిపోతాయి."

"వాలంటిన్! నీ నోటితో నువ్వు నాకు శిక్ష విధిస్తున్నావు! రేపే నీపెళ్లి ఏర్పాట్లు పూర్తవుతాయి. ఫ్రాంజ్ ఇవాళ ప్రొద్దున్న పారిస్ వచ్చాడు."

వాలంటిన్ ముఖం పాలిపోయింది. ఆమె నోట మాట రాలేదు.

"వాలంటిన్! నాకొక్క మాట చెప్పు. ఇంక మనం తేల్చుకోవలసిన సమయం వచ్చింది. నువ్వేం చెయ్యదల్చుకున్నావు?"

వాలంటిన్‌కి దుఃఖం పొంగి వస్తోంది. మాక్సిమిలియన్ ఇలా అన్నాడు: "వాలంటిన్! ఏమంటావ్? నువ్వీ పరిస్థితిలో నెను గులాడదలిచావా? ధైర్యంగా ఎదుర్కోగలవా? చెప్పు. అది తెలుసుకోడానికే వేళకాని వేళ నీవద్దకు వచ్చాను."

వాలంటిన్ ఉలిక్కిపడింది. తన తండ్రినీ, వృద్ధమాతనీ, సవతితల్లినీ ఎదిరించడమా! అసలీ విషయమై ఆమె ఇంతవరకెన్నడూ ఆలోచించనైనా లేదు. "అంటే ఏమిటి మారెల్? అమ్మమ్మని ఈ పరిస్థితిలో దుఃఖపెట్టాలి. తుది ఘడియల్లో ఆమె కోరికను నిరాకరించడమా? అది మహాపాపం! అదెల్లాగ మారెల్?"

"అవును. నువ్వు చెప్పింది నిజం" అన్నాడు మాక్సిమిలియన్.

"ఇంకేం చెయ్యమన్నావు చెప్పు మారెల్?"

"నే నెలా చెప్పను వాలంటిన్. నా స్వార్థం నాకళ్లు కప్పుతోంది."

"నీ ఉద్దేశం ఏమిటో స్పష్టంగా చెప్పు"

"చెప్తున్నా విను. నేను స్వతంత్రుణ్ణి, నిన్ను పోషించగల ధనం నావద్ద లేకపోలేదు. నిన్ను నా చెల్లెలిదగ్గరకు తీసుకుపోతాను. ఆమె నిన్ను తన సోదరిలా ఆదరించగలదు. మనం పెళ్లి చేసుకుని ఆల్జీర్స్‌కో, ఇంగ్లండుకో, అమెరికాకో వెళ్లిపోదాం. నీ బంధువులూ, మిత్రులూ మనస్సు స్థిమితపరుచుకున్నాక మనం తిరిగి పారిస్ రావచ్చు."

వాలంటిన్ అనంగీకారసూచకంగా తల తిప్పింది.

"అయితే నీకు ప్రాప్తించనున్నదానిని మౌనంతో స్వీకరిస్తావా?"

"స్వీకరిస్తాను. కాని అప్పుడు నేను జీవించడం కల్ల"

"అందుకే చెప్తున్నాను వాలంటిన్. నేను పిచ్చివాడిని.

---

1st PRIZE Rs 1,200 ALL CORRECT
2ND PRIZE Rs 500 ONE ERROR
3RD PRIZE Rs 200 TWO ERRORS
4TH PRIZE Rs 100 THREE ERRORS

గెల్వండి
రు 2,000
ఎంట్రీకి 8 అణాలు
2000
ఆంధ్రాక్రాస్ వర్డ్సు రాజమండ్రి
PRIZE AMMOUNT DEPOSITED IN → CITIZEN CHITFUND BANK
A CW

ఆధారము:—"శబ్దార్థచంద్రిక" **3-0-0 కి 7 ఎంట్రీలు** ముగింపు తేదీ - 30-10-51

అడ్డము:—1 వ్రేలివుంగరము, 2 పగలు, 3 కుండలు చేయువాడు, 4 శాంతి, 5 చనిపోయిన మనిషిని ఇలాపిలుస్తారు, 6 కాళికాదేవి, 7 పూర్వపురాజులు తలకు ధరించెడి ఆభరణము, 8 భూమి, 9 పండితుడు, 10 పాము, 12 దొర, 13 ఎడ్లను పొడి చెడుకర్ర, 15 ఇదిలేనిదే కూరలు రుచిగావుండవు, 17 రెండు నెలలలో పండెడు ధాన్యము, 18 పూగుత్తి, 19 ఆకుది.

నిలువు —1 ఏనుగును నడిపించుటకై కుంభస్థలమునందు బొడిచెడు ఆయుధము, 6 యుద్ధము, 8 అర్జునుడు, 9 కోతి, 10 రాత్రి సమయమందు మాత్రమే వీటిని చూడగలము, 11 ఇది కాలుకు గ్రుచ్చుకున్న బాధపెట్టును, 14 పాపము, 16 నరకము.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 అం | గు | ళీ | య | క | ము | ■ | 2 ధి | | ము |
| 3 కు | | | డు | ■ | ■ | 4 శ | మ | | ము |
| 5 | | ము | ■ | 6 స | | ■ | ■ | ■ | ■ |
| ము | ■ | 7 శి | ర | | ము | ■ | 8 థ | | |
| ■ | ■ | ■ | ■ | ■ | | ■ | | ■ | ■ |
| 9 వ | | ■ | 10 ఢ | | య | 11 ము | ■ | ■ | ■ |
| | ■ | 12 | డు | ■ | 13 ము | | 14 | శ్ర | ■ |
| | ■ | ■ | 15 | ల్లి | ■ | ■ | | ■ | ■ |
| | ■ | 16 | ■ | ■ | ■ | ■ | 17 ట | | క |
| ము | ■ | 18 స్త్ర | | | ము | ■ | 19 ము | | య |

FIRST PRIZE Rs 1,200
ఆంధ్రా క్రాస్ వర్డ్సు
గెల్వండి
రు 2,000

నిబంధనలు:—ఎన్ని ఎంట్రీలైనా తెల్లకాగితము మీద వ్రాసిపంపవచ్చును. లేనిచో 0-1-6 స్టాంపులు పంపినచో 15 ఎంట్రీలు (అచ్చువి) పంపబడును. ముగింపు తేదీ తరువాత వచ్చు ఎంట్రీలు అంగీకరించబడవు. ఎంట్రీలతోపాటు మనియార్డరు రశీదుగాని, క్రాస్ చేయని ఇండియన్ పోస్టల్ ఆర్డరుగాని జతచేయాలి. రు. 3/-పైన పంపిన ఎంట్రీలవారికి గెలిచినవారి లిస్టు 15-11-51 ని పంపబడును. మిగిలినవారు 0-1-0 స్టాంపు పంపినచో పంపబడును. కీ సొల్యూషను 7-11-51 ఆంధ్రవారపత్రికలో ప్రకటించబడును. ఈపోటీకి సంబంధించిన అన్ని విషయములలోనూ మేనేజింగ్ డైరెక్టర్ నిర్ణయమే ఖాయమైనది, న్యాయబద్ధమైనది. ఒకరుకన్న ఎక్కువ మంది గెలుపొందినచో బహుమతి సొమ్ము సమానముగా పంచబడును.

ఎంట్రీలు మనియార్డర్లు ఈదిగువ ఎడ్రసుకు పంపండి.

# ఆంధ్రాక్రాస్‌వర్డ్సు (A. W.) రాజమండ్రి.

మోహం ఎంత గుడ్డిదో తెలుస్తోంది. కానీ, ఏది ఎలా జరగనుందో మనకి తెలియదుకదా! నువ్వు లేని జీవితం నాకు నిరర్థకం. విధి ఇలా పరిణమించిందని మాత్రం బోధపరుచుకుంటాను. అంతే."

వాలంటిన్ గద్గదికతో అంది: "మారెల్! నే నేం చెయ్యను? నిస్సహాయురాలిని. చెప్పు. నువ్వేం చెయ్యదల్చుకున్నావు?"

"ఏంచేస్తాను? నీదగ్గర కడసారి సెలవు తీసుకుంటాను వాలంటిన్. నువ్వు సుఖంగా జీవించాలని ఆశీర్వదిస్తాను. నన్ను పూర్తిగా మరిచిపో. ఇంక నేను వడతాను."

"ఆగు. వెళ్ళి ఏంచేస్తావో చెప్పు."

"ఏం చేస్తాను? జరిగినదానికి శిక్ష అనుభవిస్తాను."

"ఏం శిక్ష?"

మాక్సిమిలియన్ వికృత మందహాసంతో అన్నాడు: "ఏమో! చుక్కాని లేని పడవ ఏ దిక్కుగా పోతుందో! నాకు తెలియదు."

"మారెల్! మారెల్! వెళ్ళిపోకు. రా. నీమాట వింటాను. చెప్పు. ఏం చెయ్యమంటావు?"

"వాలంటిన్. నీకు ఇష్టంలేని పనేదీ చెయ్యవద్దు. ఫరవా లేదు, నన్ను వెళ్ళనీ."

"కాదు మారెల్. నేనుకూడా నిన్ను విడిచిఉండలేను. చెప్పు. నేను నీతో వచ్చేస్తాను."

"అయితే విను. ఫ్రాంజ్‌తో పెళ్ళిఏర్పాట్లు జాప్యం చెయ్యగలిగితే ప్రయత్నం చెయ్యి. అది సాధ్యపడకపోతే రేపే మనం వెళ్ళిపోదాం. రేపు రోజంతా నీకోసం ఇక్కడే నిరీక్షిస్తూ ఉంటాను."

"ఆగు—ఎవరో పిలుస్తున్నారు. నే నింక వెడతాను మారెల్. నువ్వు చెప్పినది సమ్మతమే. రేపు మళ్లీ కలుసుకుంటాను." అంటూ వాలంటిన్ గబగబా వెళ్ళిపోయింది. మాక్సిమిలియన్ మారెల్ పరధ్యానంలో నడిచి వెళ్లిపోయాడు.

## 68

మరునాడుదయం మాక్సిమిలియన్‌కి ఒక లేఖ అందింది. వాలంటిన్ ఇలా వ్రాసింది. "నే నెంత బతిమాలుకున్నా, ఏడ్చినా, ప్రయోజనం లేకపోయింది. విధి ప్రతికూలంగా ఉంది. ఇవాళ సాయంకాలం తొమ్మిదిగంటలకు పెళ్ళికంట్రాక్టుపైన సంతకాలు చెయ్యడానికి ఏర్పాట్లు జరిగాయి. ఇంక నాకు వేరే మార్గం లేదు. సాయంకాలం తొమ్మిదింపావుకి వనుకద్వారంవద్ద సిద్ధంగా ఉండు. అమ్మమ్మకు జబ్బు ఎక్కువయింది. నే నందరినీ విడిచివస్తున్నలోటు నువ్వే తీర్చాలి. పెళ్ళి కంట్రాక్టు సంగతి నా తాతగారికి తెలియకుండా నా తండ్రి జాగ్రత్తపడుతున్నారు."

మాక్సిమిలియన్‌కి పిచ్చెత్తినట్లయింది. రోజంతా ఎలాగో గడిపి చీకటిపడిన తరవాత ఎనిమిది గంటలకి విల్‌ఫర్ట్ ఇంటివెనుక ప్రాకారంవద్ద చేరాడు. తోటలో చీకటి మరింత దట్టమైనట్లు కనపడుతూంది. మేడమీద గదులవంక మాక్సిమిలియన్ చూశాడు. పెళ్లికంట్రాక్టు ఏర్పాట్లసందడి ఎక్కడా కానరావడంలేదు. అంతటా నిశ్శబ్దం ఆవరించింది. గోడకు నిచ్చెన ఆనించి పైకెక్కి నిలబడ్డాడు. తరుణం వచ్చినప్పుడు జాప్యం కారాదనే ఆత్రుతతో కనురెప్పలు మూయకుండా చూస్తున్నాడు. ఎంతసేపు చూసినా వాలంటిన్ జాడ కనపడలేదు. దూరాన పదిగంటలు కొట్టడం వినవచ్చింది. ఇంటిలో ఏమి జరుగుతున్నదో మారెల్‌కి బోధపడలేదు. కంట్రాక్టుపై సంతకాలకు గంటసేపు పట్టదే! ఏం జరిగి ఉంటుంది? వాలంటిన్ ఆఖరు క్షణంలో రాలేక నిస్సహాయంగా ఊరుకుందా? కంట్రాక్టుపైన సంతకం చేసిఉంటుందా? లేక వస్తూ దారిలో స్పృహతప్పి పడిపోయిందా? మారెల్‌కి ఎటూ తోచలేదు. చివర అనుకున్నదే సంభవమనుకున్నాడు. మెల్లిగా గోడ ఇవతలవైపుకు దూకాడు. గోడవారగా కొంతదూరం నడిచాడు. ఒకచోట చెట్లగుబురుల చాటున ఆగి మేడపైకి చూశాడు. ఒక గదిలో మూడు కిటికీలలోనుంచి దీపపు వెలుగు ప్రసరిస్తోంది. ఆ గదిలోనే సెంట్‌మిరాన్‌భార్య ఉందని వాలంటిన్ ఇదివరకు అతనితో చెప్పింది.

ఏమయినాసరే వాలంటిన్‌ని చూసి తీరాలనే పట్టుదలతో ఒక చెట్టెక్కి లోనికి తొంగిచూశాడు. ఇంతలో అతనికి అడుగుల సవ్వడి వినపడింది. ఎవరో గుసగుసలాడుతున్నారు. మారెల్ గుబురులలో దాగి, జాగ్రత్తగా చెవిఒగ్గి విన్నాడు. అప్పుడే చంద్రుడుదయించాడు. వెన్నెలలో విల్‌ఫర్ట్ మరొక వ్యక్తితో రహస్యంగా మాట్లాడుతూ రావడం గమనించాడు. ఇద్దరూ వచ్చి ఆ గుబురుచెట్లక్రిందనే నిలబడి ప్రసంగించ నారంభించారు.

"డాక్టర్! ఇదేమి విపత్తు! నాయింటికేదో శాపం తగిలినట్లుందే! ఆమె చనిపోయింది! ఎంత దారుణంగా బాధపడింది!"

డాక్టర్ తీక్షణ స్వరంతో అన్నాడు: "విల్‌ఫర్ట్! మిమ్మల్ని ఊరడించడానికీ రహస్య ప్రదేశానికి తీసుకువచ్చాననుకుంటున్నారా? కాదు. ఈ మరణం అతిదారుణమైనదని మీకు చెప్పడానికి తీసుకువచ్చాను."

"ఏమిటది?" అన్నాడు విల్‌ఫర్ట్ స్తంభితుడై.

"చెప్తాను వినండి. సావధానంగా కూర్చుని వినండి."

విల్‌ఫర్ట్ దభాలున నేలపైన కూలబడ్డాడు. డాక్టర్ నిలబడే ఉన్నాడు.

"ఆఖరుసారి ఆమెకి మూర్ఛవచ్చినప్పుడు మీరామెదగ్గరున్నారా?"

"ఉన్నాను. నన్నక్కడనించి కదలవద్దని మీరే చెప్పారు కదా!"

"ఆమె ఏ జబ్బువల్ల చనిపోయిందో మీరు గ్రహించారా!"

"గ్రహించాను. మూర్ఛరోగం కదా!"

"కాదు. విషప్రయోగంవల్ల ఆమె మరణించింది."

విల్‌ఫర్ట్‌కి నెత్తిపైన పిడుగు పడినట్లయింది. కొంతసేపటివరకూ అతనికి నోటమాట రాలేదు. డాక్టర్ ఇలా అన్నాడు.

"ఆమె ముప్పావుగంటసేపు గిల గిలలాడి చనిపోవడం చూశాను. జాగ్రత్తగా పరిశీలించాను. బ్రూసైన్ ఆమె కివ్వబడింది. బహుశా పొరపాటువల్ల ఆ విషౌషధం ఆమెకివ్వబడిఉండవచ్చు."

"అదెల్లాగ?"

"ఏ ముంది? నయర్‌టైర్‌కి ఆ ఔషధాన్నే మూడు మాసాలుగా ఇస్తున్నాను."

"కాని ఆయనప్రాణం హరించని విషం ఈమె ప్రాణాన్నెలా హరిస్తుంది?"

"ఈ విషౌషధాన్ని క్రమక్రమంగా రోగాలకు అలవాటు చేస్తే కొన్ని జబ్బులు నయమౌతాయి. మూడు మాసాలు అలవాటుపడిన వ్యక్తి తీసుకునే మోతాదు, అలవాటు లేనివారు తీసుకుంటే ప్రాణాలు తీస్తుంది. అది పొరపాటునే జరిగిందో మరెలా జరిగిందో విచారించండి. దోషిని శిక్షించండి."

"కాని నా తండ్రిగారి గదిలోని ఔషధాలిక్కడికెలా వస్తాయి? అటువంటి అవకాశమే లేదే! అయినా ఏమో! మనిషై పుట్టిన తరవాత పొరపాట్లు జరక్క మానవు కదా!"

"కావచ్చు. కాని మీరు విచారణచేసి జాగ్రత్తపడ్డంమంచిది. పొరపాటే జరిగితే మున్ముందు అప్రమత్తతతో ఉండవచ్చును.

(42-వ పేజీ చూడండి)

# పాడుమనుష్యులు

## "రమణశ్రీ"

ఊరిచివరి పూరికొంపల గుంపుల్లో కూడా తెల్లవారింది. ఇంకా ఖామందులు నిద్దర తేలి ముసుగు విప్పకుండానే కూలిజనం బిలబిలలాడుతూ మెళుకువ తెచ్చుకుంటున్నారు. జల్లెడ గంపలకింద కోడి పిల్లలు తల్లిని వెన్నంటి నడుస్తూ కీచు కీచుమంటున్నాయి. నేలని జీరాడి మట్టిలో దాక్కున్న గింజల్ని, పురుగుల్ని వేటాడుతున్నాయి.

పోతురాజు యింకా కూలిపనికి లెగనే లేదు. చిరిగిపోయి మట్టీ మశానం పూసుకున్న పాత దుప్పటిని నఖశిఖపర్యంతం బిగువుగాలాగి, కాళ్లు గుండెల్లో దాచుకొని నిద్రపోతున్నాడు.

"తెల్లారింది సెగు. ఇంకా పోతునాగ నిద్దరోతన్నావ్. సోములూ ఆళ్లూ కూలికి పోతంటే సెగుసెగు"- పెళ్ళాం గంగులు గదమాయించింది.

మొండి చీపెరితో చరచర కసువ్వుం చిమ్ముతోంది. కోడిపుంజు సోమరుల్ని లేపుతోంది. బాగా బలిసి, ఫ్యాక్టరీ కూత పెడుతోంది. పారిశ్రామికుల స్వేదరుధిరాల్ని పీల్చి, పీల్చి పిప్పిచేయడానికి, బాహాటంగా ఆహ్వానం చేస్తోంది.

విధిలేక లేచెను పోతురాజు.

"పిడకలయ్యా ఉన్నై, నే 'పెద్దారం' పోయొత్తా గిన్నెలో సల్దికూడుంది. రాచ్చిప్పలో లచ్చమ్మగోరెట్టిన ఊరగాయుంది ఏసుకుతిని కూలికెల్లు"- గంగులు పోతురాజు నాజ్ఞాపించింది.

"మా అయ్యేడ కెల్లేడే?"

"మీ అయ్య పొలంపోయేడు నీ వింకా నిద్దరే" పోతురాజుకి పూర్తిగా మెలుకవొచ్చింది.

"పోదూ? 'పెద్దారం' పోతున్నావా? రాబోయేతలికి సిన్న సేపలు, ఎండిరేలు ఎత్తకరా" గంగులు పిడకలగంప నెత్తి నెత్తుకుని, వడుం ఊగులాడిపోతూంటే, జవజవలాడుతూ నడుస్తోంది.

పోతురాజు ముందుకు పోతూన్న గంగులు వైపు చూపు నిగిడ్చి చూస్తూ బంగిన పుల్ల నవుల్తున్నాడు.

"ఏడాదయింది దీన్ని మనువుసేసుకుని. ఇన్నాళ్ళ కాపరం బాగానే• ఎలగబెట్టింది. ఇప్పుడిదివరకట్లాగాక ఎప్పుడూ 'పెద్దార' మెల్తానో! అక్కడికెల్తానో అని ఏడుత్తది. దీనిసంగతేవిటి సెప్మా?"

"ఆయేల పెల్లినాడు సిక్కిన గుజ్జంమీద కూడ కూకుండి, (గుర్రం సావడానికి చిద్దంగుంది!) దీన్ని ముందేసుకుని, ముందు డప్పులు బాజేలు వాగుతూంటే, ఎనకాల పెళ్ళోరు పసుపు పాడేలు జల్లుకుంటుంటే భలేలే అనుకున్నా. ఆరోజు ఇట్టంవచ్చినట్టు తిరిగేసేం. కల్లు ముంతలు, ముంతలే ఖాళీసేసేం. అల్లాటి రోజు మళ్లీ ఎప్పుడొత్తదోగాని? రెండొందలు పోతే పొయ్యేయ్. భలే ఐంది సిక్కిందిలే. ఎవసతోన్నా పోతే! అమ్మో!"

పోతురాజుకి, పుల్లనవుల్తూంటే పెళ్లినాటి జ్ఞాపకాలు ఏకరువు పెట్టె కళ్లముందు తాండవమాడుతున్నాయి. తరవాత గంగులు కాపరానికి రావడం, చాలా 'రేతులు' గడపడం, ఇంకా కాపరం సెయ్యడం, అప్పుడప్పుడు 'యిసయాల'మీద కోపాలు, తాపాలురాడం, సద్దుకోడం, వరసగా కళ్ళలో మసులుతున్నై.

పెళ్ళినాడు తను గుజ్జంమీద "ఎల్తంటే" అందరూ తనేపే 'సూసేవోరు' తన గంగులు వైపుకూడా. గంగుల్ని తన చేతుల్తో ముందు పట్టుకుని కూర్చుంటే, అందరూ 'సూత్తుంటే' సిగ్గసేది. 'ఆళ్లేవనుకుంటారో?' అని.

"ఏవంటే నాకు సాలా యిసారంగా వుంది. ఏవవుద్దోగాని రోజు కూలి రూపాయలు దీని మొగానే ఏత్తన్నా, కమ్మలు సేయించుకుంటానంటే- ఏవోఁ? ఏం సేత్తదో?"

పోతురాజు సంపాదించిన డబ్బు పెళ్లాం చేతుల్లోనే వేసేవాడు. బజారు వెచ్చాలవీ, గంగులే చేసేది. పోతురాజు తండ్రి దురగడు కూడా రోజుకోరూపాయి సంపాదిస్తే, ఇంటిఖరుచు కవుద్ది.

పోతురాజుకి కూలికి పోవాలనే ఆలోచన అడ్డుపడింది. ఇంతలో పక్కింటి గంగడొచ్చి, "మట్టిపోత ఉందంట వత్తావేటి పోతూ!"

ఇద్దరూ కలిసి కూలిపనికి పోయేరు. గంగులింకా ఇంటికి చేరలేదు. ఎప్పుడొచ్చి, కూడొండుద్దో! అనుకుంటూ ముందుకు సాగిపోయాడు పోతురాజు.

## 2

"ఏటీ యిసయం! మాఁ ఉసారుగా ఉన్నావ్" పోతురాజు సీ వెండిగిన్నెలో గంజి తాగుతూ గంగులు 'దిలాసా'గా ఉండడంచూచి అన్నాడు.

"అబ్బే యేం నేదు. 'పెద్దారం'లో సినేమా యేత్తన్నారంట / ఎలదాం"

"సినేమా... నేరానే యెదవొబ్బమ్మలు" గంజి పూర్తిచేసి కూడులో రెయ్యిముక్కలు నంచుకుంటూ అన్నాడు.

"నువ్వు రాకపోతే యెల్లు. నే యెల్తా" ఇంతలో కూలికి పోయిన దురగడు గుడిసెలో కాలెట్టేడు.

"అమ్మో / అన్నింటికీ పెత్తందారివై పోతన్నావ్!"

"ఏం పెత్తందారినమ్మా! యెప్పుడన్నా తీసికెళ్లేవ్ గనకా! ఎప్పుడూ ఈ మురి

కొంపలో పడేడవడమేనా? సూడూ! ఆ పోచంరాజు పెళ్ళం సూకాలమ్మనంటి, నిండా పోకులు, మొఖానికి బూడిది, ఎలా గుందోసూడు-ఎన్నిసినేవాఁలుసూసిందో?"

"నీకు లేదనేనా? ఏడుపు"

దురగడు మంచంమీద పడుకొని వగరుస్తున్నాడు.

"ఏంబాబూ! ఎలావుంది"

"ఏం నేదురా! గుండెల్లో నొప్పెడతంది. అడపోద్ది."

"ఎందుకు బాబా! కూలికెళ్లేవ్! గుండి నొత్తుంటే"

"గంగూ! ఏణ్ణీళ్లు యెట్టవే."

"పుల్లా పిడకా ఏం నేదు. ఎట్టానీళ్లొత్తై"

"అన్నీ అమ్మేసుకేడవపోతే అట్టేపెట్టుకోవేఁటి? ఇంటో కూకుండేదానివి-కాసిన్నేరుకొత్తే నీ సొమ్మేంపోద్దేటే?"

"అయ్యొయ్యొ! ఇంటో కూకుంటనాన? పోద్దం సెప్పుతుంటివి! నీ కూళ్లోకి సేపలెల్లాగొచ్చినై రెయ్యిలెలాగొచ్చినై."

గంగులు మాటల్లో ఎదురుతిరిగింది. పోతురాజు మాటంటే సూటిగా జవాబు చెపుతోంది.

"ఏణ్ణీళ్లెట్టమంటే ఏటే ఏసాలేత్తన్నావ్?"

తండ్రిమూస్తే, మంచంమీద వగరుస్తున్నాడు. "పోతులాగమేసి, సినేవాఁలకెల్తదంట" గంగులుమీద చెయ్యి చేసుకోపోయేడు.

"మతిపోతందేట్రా! ఏఁవెఱగని పిల్ల! ఏదో పేడాపుల్లా ఏరుకుని డబ్బులు సేసుకుంటుంది. దానిమీద ఇరగబడతావేం? సాల్లే ఊరుకో."

గంగులు కళ్ళల్లో నీళ్లు తిరిగేయి.

"సావలేని బతుకు బతికేను. ఎందుకొచ్చింది. నేనెక్కడకన్నా పోతాను-" మనసు మాటాడింది.

సంజచీకటి పడుతోంది. గుబురు పొదలలో ఏవో రొదల సొదలు. పోతురాజు "మిల్లు"లోంచి వస్తున్నాడు. భార్యసంగతి తనకి నెమ్మదిగా ఆ చూకీ తెలిసింది. "పెద్దారం"లో ఎవణ్ణో మరిగిందంట! పిల్లా పిడకా సేసుకుని, రూపాయి-పాపాయొత్తే కాఫీలు, ఉపమాలు మింగి తింటంది. ఆ మొగుడోడితో జలసాగా తిరుగుతోంది. ఏం యేసం! ఏం యేసం! నా మీసంలో పౌరుసం ఎఱగదేమో సంజ, ఇయ్యాళ ఎల్లొద్దన్నా పెద్దారం' ఏంజేసిందో? ఆడెవడో మిలటరీనుంచి దిగినోడేనంట. దీనూరువాడేనంట! అందుకేదీనే సాలు సాగుతున్నాయ్. ఎరుగున్నవోడు దగ్గిర దీనే సాలు సాగుతున్నాయ్."

పోతురాజు మనసులో గంగుల్ని గురించి ఆలోచనలు పోయాడు.

గుడిసెలో అడుగుపెట్టేడు.

(46-వ పేజీ చూడండి)



# నా బండీ!

**శ్రీ ఆకుండి నారాయణమూర్తి**

విచిత్ర మేమిటీ అంటే, పరిగెత్తడం మానేసి ఈ మధ్య క్రొత్తగా నడవడం నేర్చుకుంది నా గుఱ్ఱం!-పైగా వెనక్కు కూడా నడుస్తున్నాది!!...

అందుకు కారణం నాకుబాగా తెలుసు. మానసికంగానూ, శారీరకంగానూ నాలో ఈ మధ్య ఏర్పడుతున్న అనువులను బాగా అర్థం చేసుకుంటున్నాది నా గుఱ్ఱం!-అందుకే దానికంత పొగరెచ్చయింది-

నా గుఱ్ఱాన్ని మళ్లీ సవ్యమయిన మార్గంలోకి తీసుకు రావడమెలా అనే సమస్యే నన్ను కొన్నాళ్లయి చాలా బాధిస్తున్నాది. ఇక నా గుఱ్ఱం నాకు లొంగదని బాగా తెలుసు. కమ్చీ పట్టుకుందికి చేతిలో చేవుంటేగా!...

సరే, నాగుఱ్ఱం ఎలా మారుతే నేం?! ...నా బండీ చక్రాలరిగి పోలేదు. ఇంకా క్రొత్తగానే ఉన్నాయి! ...అంచేతరండి-నా బండీ ఎక్కండి!-మిమ్మల్ని నాతోపాటు తీసుకుపోతా!!-

మీరు బయలు దేరక పోతే ఈడ్చుకు పోతా!-ఇకరండి!-...ముఖ్యంగా వాడిపోయిన పువ్వులవలే ఉన్న, నాలాంటి రచయితలంతా నాతో బయలు దేరండి. మనం అంతా జట్టు!-మనమంతా ఓ ముఠా!-... మరో ప్రపంచపు టంచుల్ని చూద్దాం!... ఇంకా అలా చూస్తున్నారేం?-ఎక్కండి.

మీరెవరూ జట్కా తోలలేరు. మీకు నా గుఱ్ఱం వినదు!-ఇంతకీ మీకు తోలడం వచ్చునా?- ఊహూ!-మీ సంగతి నాకు బాగా తెలుసు. జట్కా తోలుకొని జీవించే అంతటి నిర్భాగ్యులు మీరు కారని నాకు తెలుసు-కానీ-మీకు నిజంగా నా మీద అభిమానమే ఉన్నట్లయితే, బండీ తోలడం నేర్చుకుని నన్ను కాపాడండి. కొద్ది రోజుల్లో కళ్లేం పట్టుకొనే అందుకు వీలు లేని స్థితిలోకి వస్తున్నాను!-అంచేత మార్గం చూపిస్తాను, నాయందు దయ ఉంచి కళ్లేం పట్టుకొని నా సలహాలు పాటిస్తూ నా జీవిత రథాన్ని నడపడానికి ఎవరయినా వచ్చి, పుణ్యం కట్టుకోండి.

*  *  *

## 2

పాపం, ఆ అమ్మాయి గురించి తల్చుకుంటే నాకెంతేనా జాలివేస్తుంది!-నిన్న నందిన ఉత్తరంతో అప్పుడే నాలుగు త్తరాలామె దగ్గరనుంచి వచ్చేయి!...పాపం, ఆమె ఊరికనే ఆయాస పడుతున్నాది. నా యథార్థ జీవితం తెలిసినట్లే అయితే ఆమింత గా ఆయాస పడక అనవసర ఆశలతో ఆత్రత పడక పోయేదేమో అని నా తలంపు!-నేనో రచయితనన్న విషయమే ఆమెకు తెలుసును గానీ, తదితర వ్యక్తి గతమయిన నా జీవిత విశేషాలేవీ ఆమెకు తెలియవన్న సంగతి ఆమె నాకు వ్రాసిన లేఖలు బుజావు చేస్తున్నాయి!-ఆమె మొదటిమారు వ్రాసిన ఉత్తరం చదువుతూ ఉంటే కొన్ని చోట్ల కడుపు చెక్కలయేలా నవ్వు వచ్చింది!-"మీ యడ్రస్సు కనుక్కొందికి చాలా శ్రమ పడ్డాను. ఆఖరికి ఓ ఎడిటర్ ధర్మమా అంటూ మీ యడ్రస్సు ఇచ్చేడు!...... క్రిందటి వారం పత్రికలో ప్రచురింప బడ్డ మీ కథలో కాలేజీ జీవితాన్ని చక్కగా చిత్రించేరు!-ఇప్పుడు మీరింకా కాలేజీ జీవితాన్నే గడుపుతున్నారని ఆశించవచ్చా?!...కానీ మీ యడ్రస్సు కొంత మీమాంసను కలిగిస్తున్నాది. 'కేరాఫ్ డిప్యూటీ తాసిల్దారు' అని వుంది. ఆయన మీ తండ్రిగారే అనుకుంటాను..." పైరకం ధోరణిలోనే నాకెంతో నవ్వు వచ్చేవిధంలో రాసిందా అమ్మాయి.

పాపం, ఆమెకేం తెలుసు నా యథార్థ పరిస్థితి!.... ఇన్నాళ్ళవరకూ తాసీల్దారు గారింట జట్కాతోలే బండివాడిగా ఉంటున్నానని ఆమెకేం తెలుసు?—

—నా జీవన రథానికి సారథ్యం చేయడానికి ఇప్పుడెవ రొప్పుకుంటారు?— ఇక ఇప్పుడు ఆ అమ్మాయి దగ్గరనుంచి మరి లేఖ రాదని నాకు బాగా తెలుసు!... ఇక నా ఈ యథార్థ జీవితాన్ని బయట పెట్టేసిన తరువాత మరి నన్నామె తల్చుకోదనికూడా తెలుసు!...

—ఇక మీ పాఠకులలో ధైర్యం గల వాళ్లుంటే ముందుకు రండి! నా బండీ నెక్కండి. నా ఈ చీకటి జీవితపు అగాధాలను చూపిస్తా!—భయపడకండి.

—నేను మా నాన్నను ఎరగను!—మా నాన్న చనిపోయిన రెండు నెలలకు నేనీ పాడులోకంలో మా అమ్మకి మరింత దుఃఖం కల్గించడంకోసం జన్మించేను. ప్రతీ తల్లీ ఆశించే విధంగానే నా తల్లి కూడా నా గురించి ఎన్నో ఆశలు కల్పించుకుంది. కానీ, తను చేస్తున్న దాసీ పనికన్నా పెద్ద పనిని నా కిప్పించ లేక పోయింది!—ఓ తాసీల్దారు గారి అబ్బాయిని ఎత్తుకొని ఆడించడం నా మొదటి ఉద్యోగం!—ఏదో వారబ్బాయి ప్రయివేటు చదువుతూ ఉన్నప్పుడు నేనూ ఆ ప్రక్కనే ఉండి నేర్చుకున్న అక్షరం ముక్కలే ఇప్పటి నా ఈ విజ్ఞానం. నా మాతృభాషలో నాకు పెద్ద ప్రావీణ్యత ఉన్నాదని చెప్పను కానీ, నాలో ఉన్న భావాలను కాయితంమీద రాయగలను. అంతే!...

—నాగురించి మా అమ్మ ఆట్టే కాలం బాధపడ వలసిన అవసరం లేకపోయింది. మాతృత్వపు పాల పొంగులతో కని పెంచిన

(19-వ పేజీ చూడండి)

# పెద్దమనిషి

(గతసంచిక తరువాయి)

ఉదయం లేవగానే - మహాలక్ష్మమ్మగారికి బయటికి వెళ్ళేటప్పుడు చెప్పివెళ్ళే అలవాటు వయినా పాటించకుండా సరాసరి వచ్చి షరాబు బజార్లోవున్న నగల వర్తకుడు కోటిలింగం కొట్టుదగ్గర ఆగారు. కోటిలింగం పూర్వీకుల దగ్గర్నుంచీ, వెంకట్రామయ్యగారి కుటుంబంతో పరిచయమున్న వాళ్ళే. వారింట్లో కార్యంకరామత్తులకు వీళ్లే నగలు చేస్తూండేవారు.

"దయచేయండి! ఎన్నాళ్ళ కెన్నాళ్లకు దర్శనం! ఏదో విశేషంమీదనే దయచేసినట్టున్నారు" లేచి నుంచుని సవినయంగా అన్నాడు కోటిలింగం.

"ఆఁ కూర్చునేదాకా తీరికక్కడుంది? జరూరుకు వెళ్లాలి. ముందు దీన్ని తూకం వేయించండి! ఇంట్లో వొకటే గొడవ, దీన్ని మార్పించి నెక్లెస్ ఏదో కొనాలట." గొలుసు అందిస్తూ అన్నారు. చేతివేళ్లు వొణికాయి. మాటలు కొంచెం వొడుపుగా వచ్చాయి. ఆయనకు తెలిసినంతట్లో యింత వరకూ యిలా అబద్ధం ఆడలేదు. ఆడాల్సిన అవసరమూ కలగలేదు. ఇదే మొదటి సారేమో?

గొలుసు చేతిలోకి తీసుకొని కోటిలింగం వెంకట్రామయ్య గార్ని ప్రశ్నార్థకంగా చూశాడు.

"తూకం వేసి బంగారం ధర చెప్పండి! అమ్మకానికే తెచ్చాను."

"ఏం పెద్ద మనుష్యులండీ? అయినా పట్టపగలు యింత పచ్చిమోసం!" వెంకట్రామయ్యగార్ని ఎగాదిగా చూస్తూ అదోలా మొహం పెట్టి అన్నాడు.

వెంకట్రామయ్యగారి కాళ్ల కింది భూమి కదిలినట్టయింది. పై కప్పు దూలాలు మీదకు విరుచుకు పట్టున్నట్టున్నయ్. ఏదో లోతు తెలియని అగాధంలోకి జారిపోతున్నట్టనిపించింది. తన గౌరవ ప్రతిష్టలు కోటిలింగం కొలిమిలో పడి కాలిపోతున్నట్టనిపించింది. కోటిలింగానికి అది తన గొలుసు కాదని ఎలా తెలిసిందా అని ఆ వేదన పడ్డారు. ఆ గొలుసు తను కొజేసింది కాదని, దొరికిందని అగ్ని సాక్షిగా ప్రమాణంచేసి చెప్పాలనుకొన్నారు. కాని తడారిన నోట్లోంచి పొడారిన మాటకూడా పెగలి రావటం లేదు. కత్తుల బోనులో పెట్టి నొక్కినట్టయింది ఆయన గారి పని.

"నిజంగా......కోటిలింగం- అది నిజంగా......"

"ఓహో! యిందులో నిజం కూడానా? కళ్లు లేని గుడ్డి వెధవ యెవడినైనా చూసి మస్కా వేయండి. మూడు జన్మలెత్తి వెయ్యి పుటాలు పెట్టినా ఇత్తడి బంగారం ఎలా అవుతుందండీ? పాలిష్ పెట్టిన యిత్తడిగొలుసును మీరు బంగారం అని అమ్మాలంటే మీ తాతల నాటి రోజుల్లో ఏమో కాని యీ రోజుల్లో ఎలా సాధ్యమవుతుందండి." చేతిలోని గొలుసును గిరగిరా తిప్పుతూ కరుగ్గా అన్నాడు అవహేళన చేస్తూ - "మీరు కాబట్టి సరిపోయింది; యింకేలం...అయితే యీ పాటికి పోలీసులకు అప్పచెప్పి వుండే వాణ్ని - మోసంచేయాలని ప్రయత్నించినందుకు."

వెంకట్రామయ్యగారి గుండెల్లో పరుగెత్తుతూన్న రైళ్లు తలక్రిందులా పడ్డాయి. నరాలు పైకి వుబికాయి. కొన్ని క్షణాల పాటు వాయుస్తంభన చేశారు. ముక్కు క్రిందికిజారిన జోడును పైకి సద్దుకున్నారు. కోటిలింగం కొలిమికాంతిలో - ఆయన కళ్లనుంచివో మెరపు తళుక్కుమని మెరసింది! పెదాలపై చిరునవ్వు లీలామాత్రంగా కదిలింది. ఆ నుదుటినుంచి స్వేదబిందువులు క్రిందకు తొణికాయి. ఆ చిరునవ్వు వెనుక, ఆ స్వేదబిందువుల్లో వున్న విషాదాన్ని అర్థంచేసుకోటం కోటిలింగం అంతస్తుకు మించిన పని.

"ఎంత పొరపాటు జరిగింది కోటిలింగం? పిల్లలు ఆడుకునే గొలుసు తెచ్చినట్టున్నాను!" ఎలా అనగలిగాడో ఆయనకే తెలియదు.

స్నానం చేయబోతుండగా తన భార్య తెచ్చిన గొలుసు బల్లమీదవుంచి, వచ్చేప్పుడు సరిగా చూసుకోకుండా అక్కడే పిల్లలు వుంచిన యీ గొలుసు తెచ్చానని చెప్పి, పిల్లలుచేసిన కొంటెపనికి విసుక్కున్నట్టు నటించుతూ, రేపు వుదయం అసలు గొలుసు తెస్తానని, పాత బంగారం ధర వగైరా కనుక్కొని యింటిదారిపట్టేరు వెంకట్రామయ్యగారు.

తొందరపడి వెంకట్రామయ్యలాంటి పెద్ద మనుషుల్ని అనుమానించి, తూలనాడినందుకు చాలా చిన్నపోయాడు కోటిలింగం. తన తొందరపాటుకు తన్నే తిట్టుకున్నాడు.

అసలు వెంకట్రామయ్యగారి ప్రత్యేకతే అది! చీకట్లో వెలుతుర్ని, విషంలో అమృతాన్ని చూడగలిగారు. ఆ పరిస్థితిలో మరొకడైతే తెల్లగా చిత్తయిపోయివుండేవాడు. తన సమయస్ఫూర్తికి తన్ను తానే అభినందించుకొన్నాడు. అవును మరి! సమయానికి వుపయోగపడని తెలివితేటలెందుకు? లేకపోతే యీ పాటికి బజారంతా తన పేరు మోగిపోతూండేది. అసాధ్యుడు కోటిలింగం ఎంత అల్లరిపెట్టి వుండేవాడో?

బంగారం యిత్తడైనా, మరేది ఏమైనా ఆయన హృదయం మాత్రం కొంత తేలికపడింది. ఈసారి అలా పిల్లలమీద వంకపెట్టి అబద్ధం ఆడాల్సివచ్చిందనేది ఆయనగారి మనస్సుకే పట్టలేదు. తన పరువు మర్యాదలు - అలా క్లిష్టపరిస్థితిలో వున్నప్పుడు వొక్క అబద్ధమాట్టమే కాదు యింకేమయినా చేసివుండేవారు! ఆయనగారికి అంతకంటే గత్యంతరం లేదు.

శ్రీ వాసిరెడ్డి నారాయణరావు

ఏది ఎలా జరిగినా, యింకేం జరగాల్సినా యింతవరకూ నలుగుర్లో తలెత్తుకుని తిరగ్గలుగుతున్నాననే ఆయనగారి తృప్తి-ధీమా.

ఏమైనా గౌరవం, ప్రతిష్ఠకోసం ఏ త్యాగం చేయటానికైనా వెంకట్రామయ్యగారు వెనకాడలేదనటం అతిశయోక్తి కాదు. ఆయనగారికి వూహ తెలిసిందగ్గర్నుంచి, ఎలాంటి కష్టకాలంలో కూడా ఎవర్నీ ఏ విషయంలో కూడా యింతవరకు సలహా అడగలేదు. ఇతరుల ముందు తమ యీతిబాధలు చెప్పుకుని, దేబిరించుకొని వెలితిపడే తత్వం కాదు మొదట్నుంచీ. జరిగిపోయిం దాన్ని గురించి ఒక్క పురుక్కూడా తెలీనివ్వలేదు. చివరకు భార్య మహాలక్ష్మమ్మగారితో కూడా మాట మాత్రం అనలేదు.

వెంకట్రామయ్యగారు భార్య మహాలక్ష్మమ్మగారి పెద్దగొలుసును (అది ఆమెకు వాళ్లత్తగారు పోతూ యిచ్చి వెళ్లింది), మరునాటి వుదయమే కోటిలింగాని కమ్మి తన పెద్దమనిషితనాన్ని ఋజువు చేసుకున్నారు. నోరు జారినందుకు కోటిలింగం క్షమాపణ చెప్పుకొన్న తరవాత కాని ఆయనగారికి మనశ్శాంతి కలగలేదు. భార్యగొలుసు అమ్మినందుకు ఆయనగారు బాధపడకపోలేదు. ఏదో అవసరం కొద్దీ అమ్మానని చెప్పాలనుకొన్నారు. నిజంగానే భార్యకు నెక్లీస్ కొనాలనిపించింది యిప్పుడాయనగారికి.

వెంకట్రామయ్యగారు యింటికి చేరేసరికి యిల్లంతా సందడిగా వుంది. బంధువులు - పిల్లా బీరకాయి అంతా చేరి వొక పదిమంది దాకా పెళ్లికిపోయి తిరిగి వెళ్తూ మకాం చేశారు. ఇంకో విషయం చెప్పాల్సివుంది ; వెంకట్రామయ్యగారికి బంధువులయింటికి వెళ్ళే అలవాటు అంతగా లేదు. అథవా వెళ్లినాదో పూట వుండటమే బ్రహ్మప్రళయం అవుతుంది. ఆయన బంధువర్గంలో ఆయనగారి యింటికి రానివాళ్లు దాదాపు లేరనే చెప్పవచ్చు! వారింటికి రావడమే చాలా గొప్పహోదా పొందినట్టు భావిస్తారు.

అతిథిసత్కారంలో పూర్తిగా మునిగిపోయింది మహాలక్ష్మమ్మగారు. ఆమెను పిలిచి గొలుసు మార్చి నెక్లెస్ చేయించుతున్నానని చెప్పే అవకాశం దొరకలేదు ఆయనగారికి. తరతరాలనుంచి వున్న ఆగొలుసు మార్చటానికి ఆమె వొకపట్టున వొప్పుకోదని ఆయనగారికి తెలుసు. ఆయనగారి మాటకు ఎదురు చెప్పకపోయినా ఏదో కొంత రాద్ధాంతం చేస్తుందని తెలుసు. బంధువులుండగా అలా వెలితి పట్టం యిష్టం లేదు. అందుకే చుట్టాలంతా వెళ్ళేక చెప్పాలని, నిర్ణయించుకున్నారు.

కాని మహాలక్ష్మమ్మగారు పాలీష్ చేసిన అనకిలీగొలుసును మెళ్లో వేసుకుని అమాయకంగా తిరుగుతూంటే ఆయనగారు చాలా జాలిపడ్డారు. యివ్వాళ కాకపోతే రేపయినా ఆ నకిలీగొలుసు నల్లపడకపోదు! బంధువులమధ్య ఎంత అభాసుపాలవాల్సి వస్తాందోనని ఆరాటపడ్డారు. అయినా వారు చేయగలిగిందేమీ తోచక-భగవద్గీతాపారాయణంలో గడిపారు. బంధువులున్న ఆ రెండురోజులు. వెంకట్రామయ్యగారు ముభావంగా వుంటం వాళ్లు గమనించకపోలేదు. మూడోరోజు సాయంత్రానికల్లా వెళ్లిపోయారు బంధువులు. లేకపోతే యింకా రెండురోజులు వుండేవాళ్లేమో ?

గీతాపారాయణాజిజ్ఞాసలోనుండి తేరుకుని కొంత ధైర్యాన్ని చిక్కపట్టారు వెంకట్రామయ్యగారు. ఇదివరకు ఎన్నోసార్లు చదివిన గీతోపదేశంలో ఈసారి ఏదో కొత్తదనాన్ని చూశారు. నూతన అనుభూతిని పొందారు. శ్రీకృష్ణభగవానులు, తన్ను వుద్దేశించే చెప్పినట్లుగా వుంది



ఆయనగారికి. హృదయంతో చదవగలిగారు గీతను యీసారి.

సాయంకాలపు నీరెండ కిటికీలోంచి ఆయనగారి శరీరంపై పడుతూంది. నిశ్చలంగా గంభీరంగా కూర్చుని, భార్య రామలక్ష్మమ్మను పిలిచాడు. వంటయింట్లోనుంచి పరుగున వచ్చివాలింది వంటినున్న మడిబట్టతోనే భర్తదగ్గరకు మహాలక్ష్మమ్మగారు. ఆమె మెళ్ళో, కళ తప్పకుండా మెరిసిపోతున్న గొలుసును చూసి ఆశ్చర్యచకితులయారు వెంకట్రామయ్యగారు! కళ్లజోడు తుడుచుకుని మళ్ళీ దీక్షగా చూశారు. అచ్చు బంగారం గొలుసు! పసిడికాంతులను వెదజల్లుతూంది. అలా దీక్షగా ఆమెవంక చూస్తూంటే ఆమెకు వూపిరాడనంతపనైంది. అర్ధనగ్నంగావున్న తన్నేదో శల్యపరీక్ష చేస్తున్నట్టుంది. సిగ్గుతో మొహం కందిపోయింది. "అన్నం వార్చొత్తాలి!" అంటూ వంటింట్లోకి దూసుకుపోయింది — మెడ చుట్టూ చేతుల్ను కప్పుకొని గొలుసు మీదుగా.



నిస్సందేహంగా అది బంగారపు గొలుసే! అది చూశాక ఆయన చెప్పాలనుకున్న దాన్ని చెప్పాల్సిన అవసరం కలగలేదు. అందుకే ఆమెవంక అలా వెర్రిగా చూశారు వెంకట్రామయ్యగారు. కోటిలింగం మీదకోపంవచ్చింది. 'తన్ను మోసంచేసింది కోటిలింగమా? వాడా?' మరో సమస్య ఎదురైంది ఆయనకు.

బంగారపుగొలుసుని యిత్తడి అని ఎందుకు చెప్పాడో కోటిలింగం ఆయనకు అంతు పట్టలేదు. 'వాడి కేమైనా అప్పుడప్పుడూ మతి భ్రమిస్తుందా? అన్నట్టు' వాడి తాత పిచ్చెక్కి చనిపోయాడట! ఇలాంటివేవో కొన్ని వెంకట్రామయ్యగారి స్మృతిపథంలోకి వచ్చాయి.

ఏమైనా భార్యమెళ్లో బంగారం గొలువుంది. ఎన్నో సంవత్సరాలుగా వుంటూన్న తన గొలుసు మారి, మరో గొలుసు వచ్చినాగుర్తు పట్టలేని తన భార్య తెలివితక్కువకు విచారించలేదు. నిజం చెప్పాల్సివస్తే సంతోషపడ్డాడు కూడా.

తనదగ్గర డబ్బు తీసుకుపోయిన వాడూ, కోటిలింగం, భార్య మహాలక్ష్మమ్మసే, గొలుసూ, దాని సొంతదారూ, అంతా ఆయన తల్లో గలిబిలిగా కదిలారు. అయినా అందర్లాగా అంతుబట్టని దానికోసం తలపగల కొట్టుకోలేదు. వెనక దాన్ని తవ్వుకుని బాధపడనూ లేదు అంత అయోమయాన్ని అంగిటిలోనే అణిచిపెట్టుకున్నారు. వారం తిరక్కముందే అంతా మర్చిపోగలిగారు. ఏమీ జరగనట్టే నిర్వికారంగా — మామూలుగా వుండిపోయారు.

పదిరోజులు గడిచినవో లేదో గుప్ మని లోకం నోట్లో పడింది వెంకట్రామయ్యగారి కుటుంబం.

వెంకట్రామయ్యగారి బంధుకోటిలో వోహరు రాయటానికి కూడా సాహసించాడు—

'మొన్న మీయింటికొచ్చినప్పుడు రామసుబ్బయ్యగారి భార్య సోమిదేవమ్మ పెద్దగొలుసు మీ యింట్లో పోయిందట. రామలక్ష్మమ్మగారు బంగారపు గొలుసు కాజేసి నకిలీ యిత్తడిగొలుసు వుంచిందని వాళ్లంతా గోలగ చెప్పుకుంటున్నారు. నిజం చెప్పాలంటే - నామట్టుకు నేనూ చూశాను. ఆ యిత్తడి గొలుసును. పాపం ఎంతో పుణ్యం ఎంతో? సోమిదేవమ్మ అలా పొల్లు చెప్పే మనిషి కాదు. రామలక్ష్మమ్మగారు యింతకాలం వచ్చాక యీపాడు పనిచేసిందంటే నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. ఆమాట విన్నాక నాకే తల తీసినట్టుంది......'

ఆతర్వాత అక్షరాలు వెంకట్రామయ్యగారికి కనిపించలేదు. ఆయనగారి తల్లో ఆటంబాంబులు పేలినంత పని అయింది! సప్తసముద్రాలు ఘోషించాయి! తుఫాన్ చెలరేగింది! భూమి కంపించింది. అగ్నిపర్వతం బ్రద్దలైంది! లావా - గుండెల్లోంచి మాట పైకి తన్నుకువస్తూంది! కనకొలకుల్లో రక్తాశ్రువులు కదిలాయి. కళ్లు చీకట్లు కమ్మాయి. చేతివ్రేళ్లు పట్టుతప్పి వుత్తరం క్రిందకు జారింది. వెంకట్రామయ్యగారి భౌతికదేహం వాలుకుర్చీలో వాలిపోయింది. ఆయనగారి మనసు పర్వతశిఖరాలపైనుంచి సముద్రపు అఖాతాల్లోకి దొర్లిపోయింది!

ఆనోటా ఆనోటా పడి ఆవూళ్ళో వాళ్ళందరికి తెలిసింది. వెంకట్రామయ్యగారి వంశగౌరవం పొలిమేరల వరకూ యీ అపకీర్తి వ్యాపించింది. ఎన్నాళ్లనుంచో వెతుకుతున్న మచ్చ వెంకట్రామయ్యగారి కుటుంబంలో యీనాటికి కనిపించి సంతోషపడ్డారు - ఆయనగారి వంశం గౌరవం చూసి వోర్వలేని కొంతమంది లోకం కోడై కూసింది! లోకులు కాకులై పొడిచారు!! వెంకట్రామయ్యగారి - కీర్తిమందిరం కూలిపోయింది!! హృదయం తూట్లు పడింది.

మహాలక్ష్మమ్మ అంతపని చేస్తుందని వెంకట్రామయ్యగారు కలలో కూడా ఊహించలేదు. ఆమె తన ముప్పై సంవత్సరాల జీవితంలో ఎలాంటి అపోహలకు తావు కలిగించలేదు. పదిమందిలో అవుననిపించుకున్న ఆమె యీనాడు యింత పాడుపని ఎందుకు చేసిందో? ఆయనగారికి అర్థంకాకపోలేదు. ఫలానా వెంక

ట్రామయ్యగారి భార్య యింత నీచమైన పనికి, వొడిగట్టిందంటే ఆయన నలుగుర్లో ఎలా తలెత్తుకు తిరగ్గలడు? ఏ మొహం పెట్టుకొని ప్రజలమొహం చూడగలడు?

అవమానంతో, అపకీర్తితో క్రుంగి, కుమిలి క్రుశించిపోతూన్న ఆయనగార్ని మరో అనుమానం - పెనుభూతంలా పట్టి పీడించింది! తన భార్య కావాలనే ఆ పని చేసిందా? లేక పొరపాటున గొలుసు మారు పడిందా? 'ఎన్నో సంవత్సరాలుగా వుంటూన్న తన గొలుసు తెల్లవారిపోటికి నల్లపట్టం చూసి—ఆ వచ్చిన చుట్టాల్లో వాళ్లే మార్చారని భ్రమించి, ప్రతీకారంగా ఆ గొలుసు అందులో వుంచి మరోమంచి గొలుసు తీసుకొందేమో? అలా వాళ్లు తనను, మోసంచేశారనే అనుమానం పోయినా తన గొలుసు మారుపడిందనే బాధలో-ఆ పని చేసిందేమో?' వెంకట్రామయ్యగారు జీవితాంతం అది తేలని సమస్యగానే వుండిపోయింది.

పాపం మానువరాలు మహాలక్ష్మమ్మకు తన గొలుసు తెల్లవారిపాటికి యిత్తడిగొలుసు అయిందని భర్తకు చెప్పేపాటి ధైర్యం, చొరవ లేకపోయింది. బంధువులు వచ్చిన రాత్రే గొలుసు మార్పడటంవల్ల కొంత అనుమానం వాళ్లమీదే కలిగుం[illegible]చ్చు. వాళ్లు రాకముందునుంచీ మెళ్లోవున్న గొలుసే తెల్లవారాక కూడా వున్నట్టు గుర్తుకూడా వుంది! ఇది అచ్చగా వాళ్ళపనే అనేందుకు కూడా ఆ స్కారం లేదు. ఏమైనా ఆమె ది బంగారపు గొలుసు- లేకమళ్ళీ దాన్ని సాధించుకుంది. ఇంటి కొచ్చిన బంధువుల్ని అల్లరిచేసి అవమాన పెట్టడం యిష్టంలేక, చల్లగా ఆ పని కాస్తా గుట్టుచక్కంగా సర్దుబాటు చేసుకొంది తెలివైన మహాలక్ష్మమ్మ పరువు మర్యాదలు తెలిసింది కాబట్టి. ఆమె ఎందుకు చేసిందో ఆమెకు తమె మనస్సే సాక్షి!

మహాలక్ష్మమ్మగారు యీ స్థితికి దిగజారటానికి కారణం తనేనని వెంకట్రామయ్యగారు గుర్తించకపోలేదు. తన కారణంగానే భార్య యీ తప్పనిసరి దొంగతనానికి తద్వారా అపకీర్తికి గురైందని పశ్చాత్తాం పడ్డారు. ఎందుకో ఆమెంటే వోపక్క సానుభూతి మరోపక్క అసహ్యం కలుగుతూంది ఆయనగారికి. చేసినపాపం చెప్పితే తీరుతుందంటారు. కాని వెంకట్రామయ్యగారికి చెప్పినా తీరని పాపం వచ్చిపడింది!

"స్నానానికి లేవండీ!" అని లోపలినుంచి వచ్చిన పిలుపుకు యీ ప్రపంచంలోకి వచ్చారు ఆయనగారు. వోరగా వేసివున్న తలుపు పట్టుకునుంచున్న మహాలక్ష్మమ్మ మెళ్ళో దేన్నో వెదికాయి వెంకట్రామయ్యగారికళ్లు ఆత్రంగా. అప్రయత్నంగా ఆయనగారు రెండు చేతుల్తో జుట్టు పీక్కుంటూ బజార్న పడ్డారు! అమాయకంగా చూస్తూ మహాలక్ష్మమ్మ అలాగే నుంచుంది.

వెంకట్రామయ్యగారు సరిగ్గా అదే మలుపు తిరిగాడో లేదో యిద్దరు యువకులు ఆయనగారికేసి వెకిలిగా నవ్వుతూ ఎదురైనారు. వాళ్ళను గుర్తుపట్టి వెంకట్రామయ్యగారు వెలవెల పోయారు.

"అడుగో! వాడేరా! ఆ పెద్దమనిషేరా!" వెకిలినవ్వులు!! వెంకట్రామయ్యగారి చెవుల్లోంచి దూసుకుపోయినై. అంతే మళ్లీ బస్తీకి రాలేదు - ఇంటికొచ్చి గడపెక్కారు. అంతే మళ్లీ గడప దిగలేదు.

తలుపు తోసుకుని యింట్లో ప్రవేశించగానే భార్య రామలక్ష్మమ్మగారు ఎదురైంది. ఆమె మెడచుట్టూ వున్న గొలుసు కాలసర్పమై వెంకట్రామయ్యగారి హృదయాన్ని కాటందుకొంది! స్పృహతప్పి పడిపోయిన వెంకట్రామయ్యగార్ని మంచం ఎక్కించారు -అంతే పాపం మళ్ళీ మంచం దిగలేదు. నోరుతెరచి మహాలక్ష్మమ్మగారితో మాట్లాడలేదు. కళ్లు తెరచి ఆమె మొహం చూడలేదు. మహాలక్ష్మమ్మగారు ఆ గొలుసును మెళ్లోనుంచి తీయనూలేదు.

వెంకట్రామయ్యగారి వంశానికి 'మామ గొలుసు' తెచ్చిన 'మచ్చ' మాయనూలేదు.



**శ్రీ చల్లా కృష్ణమూర్తి**

"ఈ నెల యింకెప్పుడండి జీతాలూ?" అని అడిగింది శారద అతి హీనమైన కంఠస్వరముతో.

ప్రశ్నలోని వ్యథ, ధ్వనిలోని బాధ వేయి కత్తులై రామారావు హృదయాన్ని ముక్కముక్కలుగా ఖండిస్తూంది.

ఈ నాటికి ఐదు రోజులయింది శారద జ్వరముతో మంచంమీద పడి. అయితేనేమీ యింకొక దిక్కంటూ లేక పోవడంచేత లేని వుత్సాహమైనా తెచ్చుకొని పనిపాట్లు చక్కబెట్టుకుంటోంది, తన భర్త దిన చర్యలకు ఆటంకము కలుగకుండా, తమ బిడ్డ సరోజ సంరక్షణ వెలితి కాకుండా. మనోబలం శరీరరుగ్మతను పటాపంచలుగా తరిమింది మొదటిరోజుల్లో. కాని రోగానికొక మందని, మాకని పడకపోతే ఎన్నాళ్లని ధైర్యం చిక్కబట్టుకొని వుండడం, ఉండక చేయగలిగింది మాత్రం ఏముంది? వారి కుటుంబ పరిస్థితి, తిండికీ, బట్టకీ, గడవడమే దిన దిన గండంగావుంటే, డాక్టరుకని, మందుకని, ఎక్కడ్నుంచి తేవడం డబ్బు? తన భర్త సంపాదన తనకి తెలియనిది కాదు. తెలిసి కూడా తెలియనట్టుగా నటించి భర్తని పీక్కు తినే రకంలోది కాదు శారద. తను కష్టపడినా యితరులను కష్టపెట్టడాన్కి యిష్టపడని మెత్తని గుండె ఆమెది. అందుచేతనే తన చికిత్స విషయమై ఏమీ అనలేక పోయింది భర్తతో.

రామారావుకు తెలుసును భార్య దుర్గతికి తన అశక్తియే కారణమని. ఈ విషయం తెలిసి కూడా ఆమె తనమీద చూపిస్తూన్న సౌహార్ద్రతకి తను మరీ కుమిలి పోతున్నాడు. ఏ స్త్రీ శరీరం అతని సేవలో నలిగి చూర్ణమై పోయిందో, ఏ స్త్రీ రాత్రనక, పగలనక కష్టపడి అతని సౌఖ్యమే ప్రధానంగా చూచిందో, ఏ స్త్రీ ప్రతి రక్తబిందువు అతని ఆనందంకోసం వినియోగించిందో, ఆ స్త్రీ రోజు రోజూ రోగంతో కృశించి పోతూవుంటే చూచీ చూడనట్టు తప్పించుకొని తిరగవలసి వొచ్చిందంటే తన కన్నా నీచుడింకొకడెవడైనా వుంటాడా? తానింత చేతగానివాడై పోయినందుకు ఎంతలా దుఃఖిస్తున్నదీ ఆమెతో చెప్పుకుందామని ఎన్నో తంటాలు పడ్డాడు; కాని ఆమెను సమీపించడాన్కి సంకోచం; ఆమె దృష్టిలో పడడాన్కి భయం; తన విధి నెరవేర్చుకోలేక పోతున్నందుకు సిగ్గూ. నిజానికి యిన్ని భావాలూ తనలో కలిగేయీ అంటే అదంతా తన అసమర్థత నిరూపించుకోవడం యిష్టం లేక పోవడంచేతనే... లోపాలుంటే గుర్తించి మనసులో చింతించడాన్కి ఏమీ తఖరావుండదు కాని ఎంత నిజాయితీ మనిషికైనా, ఆ లోపాన్ని యితరుల ఎదుట, వారెంత ఆత్మీయులైనా సరే, వెల్లడి చెయ్యడాన్కి లజ్జ కలగడం సహజం.

రామారావు చెయ్యగలిగిందీ, చేసిందీ అంటూ ఏమైనావుంటే ఆసుపత్రికి వెళ్లి వుచితంగా వాళ్లిచ్చే మందునీళ్లు తెచ్చి పొయ్యడమే. అంతటితో రోగం కుదిరి పోతే యింకేం కావాలి. సందుకు పదిమంది ప్రయివేటు డాక్టర్లే అవసరం లేకుండా పోయేది. ప్రయివేటు డాక్టర్లంటే డబ్బున్నవాళ్ల వైద్యులన్నమాట. ఆ డబ్బే తన దగ్గర లోటు.

రామారావును అప్రయోజకుడనితో సెయ్యడాన్కి వీల్లేదు. బాగా చదువుకున్నాడు. ఉద్యోగమంటూ ఒకటుంది... అయితే తాను చదువుకున్న దానికీ చేస్తున్న వుద్యోగానికీ సంబంధం ఎక్కడైనా వుందా అంటే అది ప్రశ్నించతగ్గ విషయమే. చదువుకున్నది బి. యస్. సీ. చేస్తున్నది టైపిస్టు వుద్యోగం. తన సర్వశక్తులూ వ్యయపరిచి, పూర్వులు గడించిన ఆస్తిపాస్తులు హారతిపట్టి, రాత్రనక, పగలనక, ఏకదీక్షగా చదివి సాధించిన పట్టానికి విలువ లేకుండా పోయినా, మిగిలిపోయింది, బి. యస్. సి. అన్న మూడక్షరాల బిరుదు మాత్రం చూసుకొని ఆనందించడంకోసం. ఎవరితోనైనా చెప్పుకొని గర్వించడంకోసం, పుచ్చుకున్న డబ్బుకి విద్య చెప్పి విడిచిపెట్టడంతో విద్యాసంస్థల పూచీ తీరిపోయింది. ఇహ మిగిలింది ఎందుకింత పెద్ద చదువు చదువుకున్నాడో, దానికింత డబ్బెందుకు తగలెట్టాడో, ఆ చదువుకున్న దానికి సార్థకమేమిటో తెలుసుకోలేని అవ్యక్తుడైన వ్యక్తి రామారావు. విజ్ఞాన పరీక్షలో వుత్తీర్ణుడైన రామారావు వుద్యోగంకోసం దేవులాడి దేవులాడి చింతాకంత సహాయం పొందలేక పోయాడు ఎవరిద్వారానూ. ఎవడికొకాలీ గోల? అవతల విశ్వవిద్యాలయంవారికా, ఇవతల ప్రభుత్వానికా పట్టింది అతగాడి వుద్యోగం గొడవ! చదువుకున్న శాస్త్రానికి అనువైన వుద్యోగమంటూ ఒకటి తగలడి లేకదూ అనుకోడానికైనా! ఇంత పెద్ద చదువూ చదివి పొట్టకోసం గుమస్తాగిరి వెలిగించడాన్కి ప్రాకులాడితేనే సరిపోయింది జీవితం. అదైనా తేరగా కాచుకూచుందా? ఎన్ని ప్రయాసలు పడ్డాడు, ఎంతమంది కాళ్లుపట్టుకున్నాడు. ఏమి చేసినా ఫలం మాత్రం సున్న.

ఉద్యోగం దొరకనన్నాళ్లూ వూరికే కూర్చోడమెందుకని టైపు నేర్చుకున్నాడు. అదే సమయానికి పనికొచ్చింది. పనికిరావనిదేమిటి, బ్రతకడాన్కి దారి చూపించింది. జీవితంలోని అమూల్యమైన కాలమంతా వ్యయపర్చి గడించిన డిగ్రీ కొరగాకుండా పోయినా, ఆరు మాసాలు కష్టపడి నేర్చుకున్న టైపురైటింగు బ్రతుకు తెరువేర్పరిచిందంటే ఆ చదువుకున్న విలువ ఏ మాత్రమో ఆలోచించతగ్గ విషయమే. అయితే చదువుకోడం వుద్యోగం చెయ్యటంకోసమేనా అని మీరనొచ్చు. చదువు యొక్క వుపయోగం ఎంతైనా వుంటుంది భుక్తికి లోటులేని మహారాజులకు. కాని అలాంటివారు చాలా అరుదుగా వుంటారు. నౌకరీకోసం దేవులాడే వారి సంఖ్యే అధికం. కేవలం జ్ఞానసముపార్జనకోసం, బుద్ధివికాసం

కోసం చదువు కోవాలన్నది మనకు వర్తిస్తుందా అని సంశయం. అంతటి ఔన్నత్యాన్ని నేటి పరిస్థితుల్లో అందుకొనే స్థితికింకా రాలేదు మనదేశం. ఈ దౌర్భాగ్యభూమిలో కళ కళకోసం కాదు. కళ మరెందుకూ కాదు, డబ్బుగా మార్చుకొని పొట్టపోషించుకునేందుకు, కళ కడుపు కోసం.

రామారావుకు మాత్రం పాపమేదో ఆశ కొట్లాడుతునే వుంది. ఎప్పటికైనా తన చదువు తెలివితేటలూ సార్థకం కాకపోతాయా అని. ఏదో నిలబడడానిక్కి కాళ్లకి వూతంటూ దొరికితే, ఒకప్పుడు కాకపోతే యింకొకప్పుడైనా జాగా మార్చుకుందుకు అవకాశం చిక్కదా అనుకున్నాడు. కాని ఈ కాలంలో నౌకరీ చేసేవాళ్లు పైకి రాడానికి వున్నత విద్య వుపకరిస్తుందని తలంచడమంత గొప్ప పొరబాటు యింకోటి లేదు. పై పెచ్చు విశాలమైన దృక్పథము ఏర్పరుచుకొని, ఎంత చాకచక్యంగా పనిచేస్తే అంత అణగారిపోవడంకద్దు. ఒక మనిషిని పైకెత్తడానికి కాని, వున్నచోటునుండి కదలనివ్వకుండా చెయ్యడానిక్కి కాని యజమానుల దయాధర్మ భిక్షు. అందుచేత దొరగారిని సంతోషపెట్టడమే ముఖ్యం. ఆఫీసు పని చేయటంవల్ల కాదు, స్తుతి పాఠాల చేత, లేనిపోని చాడీలు చెప్పటంచేత, దొరగారి స్వంతపనులు నిర్వహించటంచేత, సమయం పడితే మానాభిమానాలు విడిచిపెట్టి ప్రవర్తించడంచేత. లేదా ఆదరాభిమానాలు చూపించే బంధువులెవరైనా దొరల హోదాలోనైనా వుండాలి. ఈ రెండూ లేని రామారావు పెద్దవాడు కావాలంటే ఏందారి?

ఈ కరువు రోజుల్లో తను గడిస్తున్న నూరు రూపాయిలూ ఏ మూల? లెక్కపెట్టుకోడానిక్కి రూపాయలు నూరేకాని, ఖర్చు కావడంలో చిల్లిగవ్వలకన్నా అధ్వాన్నం. స్వగ్రామం విడిచిపెట్టి కడుపు కోసం పట్టణాల్లో చేరేవారికి యిల్లు దొరకడమే విషమ సమస్య. తీరా దొరికింది ఎంత చిన్నదైనా సదుపాయాలేమీ లేకపోయినా, అద్దె మాత్రం అందుబాటులో వుండడం అరుదు. రామారావు పాతిక రూపాయిలు అద్దె యిస్తున్నాడంటే అతని ఆదాయంలో నాలుగో వొంతు స్వాహా అయిపోయిందన్న మాట. ఇహ మిగిలింది, తనూ, పెళ్లాం, పిల్లా ముగ్గురు తినాలి నెల ముప్పై రోజులూనూ, కట్టుకునే గుడ్డలమాట విడిచిపెట్టి. ఎంతకనా కష్టంగా చేసినా యిరవయ్యో తేదీలోపుగానే చేతులు ముడుచుకోక తప్పేది కాదు.

స్నేహితులనో, ఇరుగు పొరుగు వారినో బదులడిగి పుచ్చుకోడం తనకసలే మనస్కరించేది కాదు. వారేమనుకుంటారో అన్న భయం ఒక వంక, తన విషయమై వారిని కష్టపెట్టవలసి వస్తుందేమోనన్న చింత యింకొకవైపూ వుండగా, అడిగి లేదనిపించుకున్నంత అవమానం యింకోటి లేదని అతని భావం. ఒకటి రెండు మాట్లు అడిగే వారికి సంకోచం లేకపోవచ్చును. ఇచ్చేవారికి కూడా తకరావుండక పోవచ్చును. ఎంతటి వారికైనా అవసరం పడక తప్పదు. అంతలో మర్యాదకు భంగం కలుగదు. కాని పదేపదే అడిగితే పరపతి పోయిందన్న మాటే. ఇవ్వడానిక్కి సమర్థత వున్న వాళ్లు కూడా మామూలుగా పెదవి విరిచేస్తారు ఆ సమయంలో.

ప్రతి నెలాఖరునా ఉద్యోగస్థులికి ప్రాణసంకటమే, పైరామీ వున్న అదృష్ట జాతకులకు తప్ప. వీళ్లకన్నా కూలివాడు మెరుగు కొన్నివిధాలా. వాడికిఎప్పుడు ఏమిలభిస్తుందో తెలియదు. దొరికిననాడు తింటాడు, లేని నాడు పస్తుంటాడు. కాని ఉద్యోగులకు నెలకింతా అని ఒకవెల యేర్పడిపోయింది. అది కాస్తా చెయ్యి జారిపోతే ఇహ తన్నుకు చచ్చినా మరేమీ దొరకదు. ఆ రోజుల్లో



వారు పొందే ఆరాటమూ, చేసే ప్రయత్నమూ చూస్తే నూంచి కాటకం రోజుల్లో మలమల మాడిపోతున్న ప్రజల్ని నిలబెట్టడంకోసం ప్రభుత్వాధికార్లైనా యింత ఆందోళన పడతారా, యిలాంటి ఆలోచన్లు చేస్తారా అనిపించకతప్పదు. సాధారణంగా ఆదినాల్లో బజారులోపడివెళ్లడమే శీకసులు ముకున్నట్టుగా వుంటుంది వాళ్లకి. చేతిలో డబ్బున్నప్పుడు కొరగాని వస్తువులన్నీ, డబ్బులేనప్పుడెంతో అవసరంగాకనపడతవి. ఒక వస్తువును స్వాధీనం చేసుకోడానిక్కి తగిన సామర్థ్యమున్నప్పుడు దానిని తృణీకరించడం, అది వశం తప్పిపోగానే దేబిరించడం మానవనైజం కదా!

* * *

మామూలుగా ఆఫీసుకు వెళ్లేముందు ఒకసారి భార్యనుచూసి, చెప్పివెళ్దామని బహు ప్రయత్నం మీద శారద గదిలో అడుగు పెట్టాడు రామారావు. కొంతసేపు పిచ్చాపాటీ మాట్లాడిన పిదప, 'యీ నెల యింకెప్పుడండి జీతాలూ?' అని తిరిగి ప్రశ్నించింది శారద. రామారావు నిలువునా నీరైపోయాడు. ఎంతో బాధగావుంటే తప్ప శారద యిలా అడగదని తనకు తెలుసును. తానింత శక్తిహీనుడౌతాడని ఎప్పుడూ అనుకోలేదు. భార్యదుస్థితి తొలగించలేని తన నిస్సహాయతకు ఒక్క నిట్టూర్పు మాత్రం విడిచిపెట్టి ఆమె ప్రక్క మంచంపై కూర్చున్నవాడు లేచి నిల్చున్నాడు జవాబు చెప్పకుండా. మంచం దగ్గర నిలబడి శిరస్సు మంచంపై వాల్చి, అర్థంకాని తల్లిదండ్రుల స్థితికి వాళ్ల మొహాలవైపు అయోమయంగా చూస్తున్న సరోజను ఎత్తుకొని ముద్దాడి, 'శారదా! ఆఫీసుకి వెళ్లివస్తా'నని ఆమె వైపు దృష్టి పెట్టకుండానే అధోముఖంగా గబగబా వెళ్లిపోయాడవతలికి రామారావు.

ఆ సాయంత్రం యింటికి రావడంతోనే ముందుగా భార్య గదిలోకి వెళ్లాడు. నెమ్మదిగా మంచం ఒడ్డున కూర్చొని 'శారదా!' అని ముద్దుగా, ఎంతో మృదువుగా పిలిచాడు. ఆమె మొహం మీద మొహంపెట్టి. శారద ఆశ్చర్యపోతూ కళ్లు విప్పి చూసింది శాంతం వుట్టిపడుతున్న ఆ గొంతుక విని.

'ఇదేమిటో చూశావా?' అన్నాడు తన జేబువైపు చూపిస్తూ, ఆవిడ రెప్ప వెయ్యకుండా చూస్తోంది అతని మొహంలోకి. ఏదో వుత్సాహమూ, ఆనందమూ గోచరిస్తున్నాయా మొహంలో.

'ఇదిగో!' అని జేబులోనుంచి పర్సు తీశాడు. ఆమె వెర్రి వెర్రిగా చూస్తోందతనివైపు యిదంతా ఏమిటన్నట్టు.



'ఎంత ప్రయాసపడ్డాననుకున్నావ్. ఈ వేళంతా పనిచెయ్యలేదంటే నమ్ము. వాడి తస్సాదియ్యా! ఒకంతట ఒప్పుకున్నాడు కాదు. అయితే మాత్రం మనం వొదిత్తేనా జలగలాగ పట్టుకొని ఆఖర్కి 'ఊ' అన్నాడు మా దొర విసుగెత్తిపోయి. నెల కాకుండా జీతం ఎవరికీ ముందుగా యివ్వరనుకో. వూరికనే యిచ్చాడా? కళ్ల నీళ్ల పర్యంతం తెప్పించి మరీ యిచ్చాడు... ఎన్ని పాట్లుపడినా కొసకి నెగ్గించుకున్నాను కదా అన్న సంతోషం...ఏదోలే! ఇహ నీకొచ్చిన భయంలేదు. డాక్టర్ని తీసుకొస్తాను' అన్నాడు తనెంత కష్టపడిందీ వర్ణిస్తూ, యీ కష్టమంతా నీకోసమే పడ్డాను సుమా అని చెప్పడానిక్కి. తన విధి తను నెరవేర్చుకుంటున్నప్పుడైనా సరే చేసిన పనిని గొప్పగా వర్ణించి చెప్పడం అదొక ప్రతాపంగా భావించడం అలవాటు కొంతమందికి.

శారద పెదవుల మీద చిన్న మందహాసం తాండవించింది. రామారావు పకపకా నవ్వేడు. ఆ యింట్లో పూలవర్షం కురిసింది. ఇల్లు కళ కళలాడింది. గోడలు కిలకిలా ప్రతిధ్వనించాయ్. అబ్బ! ఎంత మహత్తుంది డబ్బులో! క్షణకాలం క్రిందట శ్మశానంగా వున్న యిల్లు యిప్పుడు దివ్యభవనంగా మారింది. శవాల మాదిరిగా వున్న మనుష్యులు దేవతల్లా మారిపోయారు. కళాకాంతీ లేని మొహాల్లో దివ్యజ్యోతి వెలిగింది.

ఇంతలో ఒక్కర్తే అవతల మన్నుతో ఆడుకొంటున్న సరోజ తండ్రి నవ్వు విని లోపలకు వచ్చింది. అమాంతంగా తండ్రి తొడలపైపడి 'ఏమితే నాన్నా తెత్తేవూ!' అని నడుం రెండు చేతులా పెనవేసుకుంది.

'ఏమిటి కావాలమ్మ నీకూ?'

'బిత్తత్తులు!'

'బిస్కట్లేనా? తరవాత తెస్తానులే!' అని బుజ్జగించాడు.

'పోనీ దానికి ముందు బిస్కట్లు తెచ్చి యివ్వండి. తరవాత వెళ్దురుగాని డాక్టర్ని పిలవడానిక్కి' అంది శారద నెమ్మదిగా.

రామారావు రెండు కళ్లూ పెద్దవి చేసి ఒక్కసారి చూశాడు. తన స్త్రీ వైపు. ఆ మాతృహృదయంలో అంతర్లీనమైన అనంత

ప్రేమ వాహిని ఎలా పొంగి పొర్లుతోందో తన వూహకూడా అందలేదు. జీవన్మరణ సంధిగ్ధావస్థలో కొట్లాడుతున్న తనప్రాణాలని లెక్కచెయ్యకుండా, కన్నబిడ్డ కాంక్ష తీర్చడమే ముఖ్యంగా పరిగణించిన ఆత్యాగమూర్తి సహనశక్తికికంపించిపోయాడు తాను. నోటమాట పెకల్లేదు. లేచి వెళ్లిపోయాడు బజారుకి.

అరపౌను 'బ్రిటేనియా' బిస్కట్లు కొని జేబులో చెయ్యి పెట్టాడు డబ్బు చెల్లిద్దామని. పర్సు చేతికి తగల్లేదు. గతుక్కుమన్నాడు. ఏంవయినట్టు పర్సు?... జేబులన్నీ వెతికాడు. ఒళ్లు చిరు చెమటపట్టింది. నొసటిపైనుండి బొట బొట కారుతున్నై చెమట బిందువులు. కమీజు గుండీలు విప్పి బనీనుకూడా తడిమాడు. దానికి జేబంటూ వుంటే కదూ అందులో పెట్టడానికి... తలగిర్రున తిరుగుతోంది. శరీరమంతా తడివి చూసుకున్నాడు. క్రిందికి వంగి షాపుమూలమూలల్లో వెతికాడు...ఉ. హూ. ఎక్కడా అవుపించలేదు పర్సు. షాహుకారు యిదో తమాషా అన్నట్టు అసహ్యంగా చూస్తున్నాడు రామారావుకేసి...తాను నిల్చున్నచోట నేల కూరుకు పోతున్నట్టుగా అనిపించింది రామారావుకు. షాపు యజమానితో ఏమో చెప్పడానికి పెదవులు కదిల్చాడు కాని గొంతుకలో పాతుకు పోయింది ఆ చెప్పదల్చుకున్న మాట. ఏడుపు మొహం పెట్టి వచ్చేశాడు రోడ్డుమీదికి బిస్కట్లా దుకాణంలోనే ఒదిలిపెట్టి.

దారి పొడుగునా కనిపించిన ప్రతి వస్తువునూ ఎత్తిచూశాడు. రాయోరప్పో కాలికి తగలగానే త్రుళ్లిపడుతున్నాడు. కానీ పర్సు మాత్రం ఎక్కడా దొరకలేదు. చిమ్మచీకట్లు క్రమ్మేయికళ్లకి. నడవడానికి పట్టు దొరకలేదు కాళ్లకి. తూలిపోతూ, తూలిపోతూ ఎలాగో సంబాళించుకొని పోతున్నాడు.

మనీపర్సు ఏంవయినట్టు? దారిలో ఎక్కడైనా జారిపోయిందా! అసంభవం, జేబుకొక్క చిల్లియైనా లేదే!....ఎవడైనా దొంగిలించాడా? కావచ్చును. అంతేకావచ్చును. తన డబ్బు దొంగిలించడానికి వాడింకెంత దరిద్రగొట్టు విధవైయుండాలి?...ఇంటిలో మాత్రం విడిచి పెట్టలేదుకదా యాదమరుపుగా?...ఈ ఆఖరు అభిప్రాయం కలగడమే కొంచెం ఆశ కొట్లాడింది. ఇంటిలోని సంఘటన యావత్తూ జ్ఞప్తికి తెచ్చుకున్నాడు పర్సు జేబులో పెట్టుకున్నట్టు జ్ఞాపకం. అలాగని నిర్ధారణగా చెప్పలేడు' అనుమానం పీకుతోంది. ఆదరా బాదరా పరుగెత్తాడింటికి.

ఇంటిలో ఏమి సామానుంది గనక! బీరువాలా? డ్రాయర్లా? ఎక్కడ పెట్టేశానో అని ఆలోచించడానికీ, వెదకడానికీన్నీ. ఉన్న రెండు ట్రంకుల్లోవి బట్టముక్కలు మాత్రం దులిపిందే పదిమాట్లు దులిపి చిందరవందరచేసి పారేశాడు. చెయ్యి పెట్టిందగ్గిరే మళ్లీ మళ్లీ చెయ్యిపెట్టి, మూల మూలల్లో వున్న చెత్తా చెదారం పైకి లాగాడు చీపురు పట్టుకొని. అంతా వృథా ప్రయాసని తేలిపోయిం తరవాత తడబడుతూ వెళ్లి మంచానికి ఎదురుగా వున్న కుర్చీలో కూలబడ్డాడు నొసటిమీది చెమట చేత్తో తుడుచుకుంటూ.

భర్త దేనికోసమో తడుముల్లాడుతున్నట్టు గ్రహించిందే కాని జరిగిన అనర్థ మేమిటో తెలుసుకోలేక పోయింది శారద. ఏమి జరిగిందో అడిగి తెలుసుకునేంత నెమ్మది, ఓపికా లేదు తనలో. భర్తే చెబుతాడుకదా అని ఎదురుచూస్తోంది.

'శారదా!' అని పిలిచి 'యిక్కడ.... యిక్కడ...' అని చెక్కేశాడు. ఆ పైని ఏమడగడానికీ మడతపడిపోయింది నాలుక. శారద రెప్పలెత్తి అతని మొహంలోకి చూసింది. చెక్కిళ్లు పాలిపోయి, కండ్లు లోతుకుపోయి, ఎన్నాళ్ళో జబ్బుపడ్డవాడిలా అవుపించాడా క్షణంలో.

'ఇక్కడ కాని నా పర్సు మర్చిపోయానా?' అని అడిగాడు ఎట్టకేలకు మాట తెముల్చుకొని. ఆమాట వినగానే శారదగుండె ఝల్లుమంది. 'ఆఁ' అని నోరు విప్పి కండ్లు మూసుకుంది అప్పుడే ప్రాణాలు పైకెగిరి పోయినట్టుగా అనిపించి.

లోకమంతా చీకటితో నిండిపోయి

(34-వ పేజీ చూడండి)

# నా బండి!

(10-వ పేజీ తరువాయి)

నా తల్లిబాధలు భగవంతుని హృదయం లోకి దూరేయి!... జాలితో లాలించి ఆమెకు శాశ్వత నిద్రను ప్రసాదించే డా కరుణా మయుడు!—ఇప్పుడు నే నేడుస్తున్నానో నవ్వుతున్నానో మీకు తెలీదు. నాకళ్ళల్లో నీళ్లా నాడే అయిపోయేయి!...

నా ఈ దీనావస్థ తాసీల్దారుగారి హృదయాన్ని దూసుకుపోయింది. నామీదాయనకు జాలికలిగింది. వారింటి పనిచేస్తూ శాశ్వతంగా నన్ను వారింట్లోనే ఉండమన్నారు! వారింట్లో ఉంటూనే క్రమంగా జట్కా తోలడం నేర్చుకున్నాను. నా జీవితంలో నే చేసిన రెండో ఉద్యోగం అదే!.. ఆదిలో అమాంతంగా ప్రకృతి దేవతను దూసుకొని పోయి, సహజ లక్షణాన్ని విడిచి పెట్టకుండా 'అతి సాఫీగా పోయేది నాబండీ!... ఇప్పుడు మోజు తగ్గుతున్నాది కానీ, మొదట్లో చాలా మోజుండేది నాబండీమీద లోకులుకి!...

ఇంతకీ, మీరు నాబండీని ఎప్పుడూ చూడలేదని కదూ అనుకుంటున్నారు!... చూసేరు!...చాలాసార్లు చూచుంటారు!!.. చాలాచోట్ల చూచుంటారు. ప్రస్తుతం మీరు నా బండీలోనే వున్నారు. గాబరా పడకండి! నాబండీ అంటే ఏమిటో తెలుస్తే మీకా గాబరా ఉండదు—

ఇప్పుడు నా ఈరథం మందగమనంలో ఉంది. అందుకు బాధ్యుడను నేను కాదు. నాకు సంప్రాప్తమయిన ఈజబ్బే అందుకు కారణం! ఈజబ్బే తాసీల్దారుగారికి కూడా నా మీద అసహ్యం గలిగినట్లు చేసింది. ఈ జబ్బే నా బండీకి అడ్డుగా తాటకిలా నిలబడి నాట్యం చేస్తున్నాది!-

ఈ జబ్బు నాకు తగ్గుతుందనే ఆశ మరి లేదు. నా హృదయానికి నిరాశ అనే బూజు పట్టుకుంది. ఈ బూజుని మీరు కాదు కదా నేను కూడా దులపలేను!-

కానీ చిన్న ఆశ మాత్రం మిగిలి ఉంది. ఎవరయినా పుణ్యాత్ములు, కళ్లెంకమ్చీ, పట్టుకొని నా బండీని నడపగలరేమోనని!..

'నీకేం సంకటం?' అని మీరడగవచ్చు. నా చేతి వ్రేళ్లు ఇప్పటికి సగం మొండేలయి పోయేయి!..ఇక కొద్దిరోజుల్లో నా చేతులు మరెందుకూ పనికి రావు!...ఈ పాడు ముండా జబ్బు లక్షణం అది!...నన్నేం చెయ్యమంటారు?-నా ప్రార్థనేమిటీ అంటే నా బండిలో కూర్చొని, నా సలహాలు పాటిస్తూ మరి కొంత కాలం పాటయినా నా బండీ తోలమని!...నా చేతికే వ్రేళ్లున్నట్లయితే మిమ్మల్ని ఎవర్నీ ఇంతలా బ్రతిమాలను!...ఇక కొద్దిరోజుల్లో ఈ ఉనతి పాటి వేళ్లూ మొండిగా తయారవుతాయి!.. అప్పుడు నా బండీకి మరి చక్రాలుండవు!!

నాకు ఇప్పటికి నాలుగుత్తరాలు వ్రాసిన ఆ అమ్మాయి, ఈ మొండి చేతులతో శ్రమపడి నేనెలానో రాసిన ఈ రచన చదవంగానే నాకుత్తరం మరి రాస్తుందో వ్రాయదో చూడాలి!-బహుశా ఆమె ఏ క్షయరోగో అయితే, పెద్దరోగంతో ఉన్న నాకర్ధాంగియగుటకు ఒప్పుకొని నా బండీని కొంత కాలం పాటయినా తోలడానికి పనికొస్తుందేమోనని నా ఆశ!...

సరే, ఇక బండీ దిగండి!... నా మొండి వ్రేళ్లంట రసి కారుతున్నాది!-ఈ కంపు మీరు భరించలేరు. నిరాశా పూరితమయిన దీకంపు. మానవుడు ఆశా జీవి అని కదూ మీ వాదం. కానీ నాకు మరి ఆశ లేదు. ఒకే ఆశ!!...ఎవరయినా నన్ను ప్రేమించి నా బండీ తోలడానికి సమ్మతిస్తారా??!.. అందుకు సమ్మతించిన వాళ్లు నాకు లేఖ వ్రాయండి.



పెద్దకథ

# జీవితరేఖ

"ప్రేమ"

"రాధా...రాధా...రాధా..." ఎంతో ఆనందంతో ఇంట్లో అడుగు పెట్టిన గోపాలం, లోపల గదిలో వంటచేసుకొంటున్న భార్యని పిలిచాడు.

"ఒస్తున్నానండీ." అన్న రాధ సమాధానానికి తృప్తిపడని అతను, "త్వరగా రావాలి." అని తొందర చేశాడు.

"ఏమంత తొందర ?" అ నడిగింది రాధ, రాకుండానే.

"రారాదూ, చెప్తాను." అన్నాడతను.

"ఇప్పుడొస్తే ఇక్కడ కూర మాడిపోతుందండీ."

"ఏమీ పర్వాలేదు లే రద్దూ."

భర్తమాటల్లో సుస్పష్టమైన విసుగుని అతని ముఖంలో చూసినట్టు లేచివచ్చింది ఆమె.



రాధ తెచ్చిన మంచినీటిని అందుకొంటూ అన్నాడు గోపాలం—

"నీకోమంచి బహుమానం తెచ్చాను."

"ఏమిటో అది ?" అంది ఆమె అతని మొహంలోకి కొంటెగా చూస్తూ.

"చెప్పుకో చూద్దాం" అన్నాడతను, చెప్పలేనట్టు చూస్తూ.

"చెప్పనా ?"

"ఊఁ! కాని మూడు ఛాన్సులలోగా చెప్పుకోవాలి సుమా !"

"అలాగే కానీ ముందా న్యూస్ పేపరు విప్పండి చెప్తాను."

న్యూస్ పేపరు చుట్టి ఉండి తన కివ్వబోయే ఆ బహుమానాన్ని చూపెడుతూ అన్న రాధ మాటలకి గోపాలం నవ్వుతూ అన్నాడు—

"గొప్ప తెలివేలే. న్యూస్ పేపరు విప్పితే నువ్వు చేప్పేదేమిటి ?"

"లేకపోతే నాకేమైనా దివ్యదృష్టి ఉందనుకున్నారా విప్పకుండా చెప్పటానికి !" అందామె నవ్వుతూ.

"ఊహించు చూద్దాం, నీ బుర్రెంత గొప్పదో."

ఆ మాట విని రాధ ఆలోచనలో పడ్డది. ఎంత సేపాలోచించినా ఆమెకా బహుమాన మేదో తట్టనే లేదు. చివరకి ఇంట్లో మిరపకాయలు లేవనీ, సాయంత్రం ఆఫీసునుంచి ఇంటికి వచ్చేటప్పుడు పట్టుకు రమ్మనీ పొద్దున అతనితో చెప్పిన సంగతి స్ఫురణకురాగా అడిగింది ఆమె—

"మిరపకాయల పొట్లమా ?"

"ఛీ ఛీ. అప్పుడే ఒక 'ఛాన్సు' 'లూజ్' చేసుకున్నావ్. ఊరికే నోటికి వచ్చింది వాగకపోతే కాస్త ఆలోచించి చెప్పరాదూ ?"

గోపాలం మాటలు విని వాడిపోయిన ముఖంతో రాధ మళ్లీ ఆలోచనలలోకి అడుగు పెట్టింది. తనకి చదువుకోటానికేదైనా పుస్తకం తెచ్చాడేమో ననుకుంది గాని మళ్ళీ తప్పితే తిడతాడేమో నని భయంవేసి చెప్పలేదు. అయినా అదంత బలంగా కనపళ్లేదు ఆమెకి.

రాధ ఏమీ మాట్లాడక పోవటం చూసి గోపాలం ఎగతాళిగా అన్నాడు.

"ఏం ? చెప్పలేవా ?"

అది వినేసరికి రాధలో అభిమానం ముంచుకొచ్చింది, అందువల్ల "ఎందుకు చెప్పలేనూ ?" అంది రోషంతో.

"మరి త్వరగా చెప్పూ" అన్నాడతను.

రాధలో పట్టుదల పెరిగింది. ఏమైనా తనా బహుమానాన్ని కనిపెట్టి తీరాలన్న దృఢసంకల్పంతో మళ్ళీ ఆలోచనలలోకి ప్రవేశించింది. ఇంట్లో లేని వస్తువు లన్నిటినీ ఆపాకెట్టుతో పోల్చిచూసి పెదవి విరిచింది. కాలంగడుస్తున్న కొద్దీ తను చెప్పలేకపోతున్నా నన్న భయమూ, అందువల్ల చిరాకూ అంకురిస్తున్నా యామెలో. అయినా ఎంతో ఓపికతో ఆలోచనలు సాగిస్తూనే ఉంది.

ఫలితంగా చివరకి అకస్మాత్తుగా తట్టిందామెకి. తాను కనుగొనగలిగానన్న సంతోషంతోనూ, అప్పుడే దాన్ని బయట పెట్టటం తన కేమాత్రం ఇష్టంలేకపోవటంతోనూ, భర్తని కాసేపు ఆడిద్దామన్న ఉద్దేశంతో అన్న దామె–

"తెలిసింది లెండి."

గోపాలం ఒక్కసారి ఉలిక్కిపడాడు. రాధ కనుక్కోగలిగిందా ! అన్న ఆశ్చర్యం అతనిలో మూర్తిభవించింది. ఆమె మొహం కళకళలాడుతూ నిజంగా కనుక్కున్నదానల్లేనే కనపట్టంతో మరింత కుంగిపోయి అయినా తప్పదన్నట్టుగా అన్నాడు–

"తెలిస్తే ఏమిటో చెప్పూ?" అని.

"అదీ...అదీ..." అని ఆగిపోయింది రాధ.

"ఆగుతావేం, చెప్పూ." అన్నా డతనందుకొని.

"చెప్పనా...నిజంగా చెప్పనా......" అంటూ నవ్విం దామె.

"అసలు నీకు తెలుసునా, తెలియదా. అది చెప్పు ముందు" అనుమానంగా అన్నాడతను. ఒక చెంప తనని ఏడిపిస్తోందని తెలియకపోలే దతనికి. అందువల్ల కాస్త కోపం కూడా కలిగింది గోపాలానికి.

"ఏం? ఎందుకు తెలియదు?" అంది రాధ కోపం నటిస్తూ.

"తెలిస్తే చెప్పవేం, ఇందాకట్నించీ?" అన్నాడతను చిరాకుతో.

"అయితే చెప్తున్నాను, వినండి." అని "అదీ...అదీ..." అంటూ మళ్లీ ఆగిపోయింది రాధ.

"అదుగో మళ్లీ."

"అబ్బ. చెప్పనివ్వండి మీరు."

"త్వరగా చెప్పు మరీ"

"అది...అదీ...పం..చ...దా...ర..." అంది చివరికి నవ్వుతూ చెప్పగలిగానన్న సంతోషంతో.

అతను ఒక్కసారి నోరు తెరిచి "షిడా నీకు తెలిసింది." అన్నాడు.

రాధ తప్పు చెప్పిందన్న సంతోషంతోనూ, ఇంతసేపట్నుంచీ తనని తిప్పలు పెట్టిందన్న కోపంతోనూ మాటలు పట్టిపట్టి పలుకుతూ "ఉత్త మట్టిబుర్ర." అన్నాడు మళ్ళీ.

రాధ ఆనందానికి ఆనకట్ట అడ్డుపడింది. భర్త మాటలు విన్న ఆమె నివ్వెరపోయి నుంచుంది. తను ఎంతో గొప్పగా కనిపెట్టగలిగానన్నుకున్న దాన్ని తన భర్త ఇంత తేలిగ్గా కొట్టివేశాడన్న సంగతి తెలుసుకున్న ఆమెలో ఉద్రేకం కట్టలు తెగి ప్రవహించింది. బుంగమూతితో అంది ఆమె -

"పోనీలెండి నాది మట్టిబుర్రైతే అయింది. మీది గట్టిబుర్రేగా. మీరే చెప్పుకోండి."

చివాలున లేచి వెళ్లిపోబోతున్న రాధ చీర చెరగు పట్టుకుని లాగుతూ అన్నాడు గోపాలం. అతనిలో సంతోషం మరింత ఉప్పొంగింది. ఆ బహుమానం పేరు చెప్పగానే ఆమె మొహం ఎంతో ఆనందంతో విప్పారుతుందనుకున్నాడు అతను. అందువల్ల ఆమెని మరింత ఏడిపించటానికి సిద్ధపడ్డాడు.

"ఇంకో ఛాన్సు ఉందిగా. అదికూడా కానీ."

"నాకేం అక్కర్లేదా ఛాన్సు. కావాలిస్తే మీరే చెప్పుకోండి. లేకపోతే ఊరుకోండి."

"అంత కోపమైతే ఎలా?" అన్నాడతను ఆమె చుబుకం ఎత్తి పట్టుకుని ఓదారుస్తూ.

"అబ్బబ్బ. ఏం చంపుతారండీ. అవతల కూరమాడిపోతోంది. త్వరగా చెప్పండీ ఆ బహుమానమేదోనూ." అందామె మొహంలోకి నవ్వు తెప్పించుకుంటూ.

"పోనీ దించిరా చెప్తాను." అన్నాడతను.

"మీరు చెప్పేస్తే నే వెళ్లి నాపనేదో చూసుకుంటాను."

"అలా వీల్లేదు. ముందది దించి వస్తే కాని చెప్పను."

రాధ గత్యంతరం లేక లోపలికి వెళ్లి కూరదించి మళ్ళా వచ్చింది.

"ఇంక చెప్పనా?" అనడిగాడతను, ఆమె రావటం చూసి.

"ఊఁ." అంది రాధ.

"అదీ... అదీ..."

"చెప్పండీ." అంది ఆమె దీర్ఘాలు తీస్తూ.

"చెప్పనా...నిజంగా చెప్పనా..." నవ్వుతూ అన్నాడతను

"అబ్బబ్బ. ఒద్దులెండి. చెప్పవద్దు." తనమాటలే తన కప్పచెప్పుతున్నాడన్న రోషంతో అంది రాధ.

"అయితే ఈసారి చెప్తాను విను. అదీ.. అదీ...పంచదార" అన్నాడు గోపాలం.

"ఏమీ కాదు." అంది రాధ దృఢస్వరంతో.

"పోనీలే ఆ మాత్రం బుర్రైనా ఉంది కదా. అయితే ఈసారి నిజం చెప్పనా?" అన్నాడతను.

"చెప్పండి." రాధ ఆశగా అతనివంక చూస్తూ అంది.

"చీర." నవ్వుతూ అన్నాడు అతను.

"చీరా!" అంది రాధ ఒక్కసారి ఉలిక్కిపడ్డట్టు.

"అవును. ఎందుకంత ఆశ్చర్యం?"

రాధ మొహం పాలిపోయింది. ఆమె మొహంలో నెత్తురుచుక్క లేదు. చీర పేరు చెప్పగానే ఆమె మొహం ఎంతో ఆనందంతో కళకళలాడుతుందనుకున్న గోపాలం ముడతలు పడ్డ ఆమె మొహం వంక ఆశ్చర్యంగా చూస్తూ అన్నాడు—

"అదేమిటి మొహం ముడుచుకుంటావెందుకు?"

అతనన్నదేమీ వినిపించుకోకుండా గంభీరంగా అడిగిందామె—

"ఎంత?"

"ముప్ఫయి రూపాయలు."

"మీ జీతమో?"

"డెబ్భయి అయిదు."

"ఇవ్వాళ తారీకెంత?"

"ఒకటి."

"ఇంటద్దె?"

మండిందతనికి.

"కోర్టులో క్రాస్ ఎగ్జామిన్ చేసినట్టు ఏమిటి ప్రశ్నలు. నే నిహ సమాధానాలు చెప్పను." అన్నాడతను కోపంగా.

రాధ అందుకుని అంది—

"పోనీ నే చెప్తాను వినండి. ఇంటద్దె ఇరవై. పాలూ, పెరుగూ పదిహేను. చీర ముప్ఫయి. మీ జీతం డెబ్భయి అయిదు. మిగిలేదిపది..."

గోపాలం—"అయితే...?" అన్నాడు విసుగ్గా.

రాధ వినిపించుకోకుండా ఆమె ధోరణిలో అంది—

"అప్పటికీ అంట్లు నేనే తోముకుంటున్నాను. గుడ్డలు ఉతుక్కుంటున్నాను. నీళ్లుతోడుకుంటున్నాను. పనిచేసేదాని చాకిరీ అంతా నేనే చేసుకుంటున్నాను. చాకలిదాన్ని కూడా..."

"అయితే ఏమంటావ్?" అన్నాడు గోపాలం కఠినంగా, మధ్యలో అందుకుని.

"పదిరూపాయలు ముప్ఫయి రోజులు రావంటాను."

"దానికి నేనేం చెయ్యాను?"

"ఈచీర తిరిగి ఇచ్చేసి రండి."

"ఏడిచినట్టుంది. అసలే ముక్కు మొహం తెలియనివాడు మళ్ళీ ఇదిస్తే ఎందుకు తీసుకుంటాడు?"

"పోనీ ఇదిచ్చేసి ఇంతకంటె తక్కువలో—ఏపది పదిహేనురూపాయలకో - వచ్చే దేదైనా తీసుకురండి."

"ఇంతకంటె ఎక్కువ ఖరీదులో వచ్చేదేదైనా కొంటే ఇది తీసుకుంటాడుగానీ, ఇంతకంటె తక్కువ ఖరీదులో వచ్చేదికొంటే ఇదెందుకు తీసుకుంటాడు?"

"ఇలా తప్పకోకపోతే మళ్లీవెళ్లి వాపసు చెయ్యటం నాకిష్టంలేదని చెప్పకూడదూ?" రాధ కోపంగా ఎత్తిపొడుస్తూ అంది. గోపాలం విసుక్కుంటూ—

"నా ఇష్టం. వాడి కొట్టుకి మళ్లీ నేను వెళ్లను. కట్టుకుంటే కట్టుకో. లేకపోతే తగలపెట్టుకో. నీచీరల గొడవెవడిక్కావాలి." అన్నాడు.

"పాపం. అందుకే కాబోలు కొంపలో మూడు చీరెలు మూలుగుతున్నా ముప్ఫయి రూపాయలూ తగలేసి మరొకటి తెచ్చింది."

"ఉన్నాయిలే మూడు చీరలు. ఒకటి వెలిసిపోయింది. ఒకటి చిరిగిపోయింది... చెప్పకోటానికూడా సిగ్గు చేటు." గోపాలం ఎగతాళిగా అన్నాడు.

రాధ బాధగా అంది—

"పోనీలెండి. లేనివాళ్లకి ఏవైతేయేం?"

"వెధవ గుడ్డలు వేసుకు తిరిగితే సంఘంలో మర్యాదగా ఉండొద్దూ?"

"అందుకని ముప్ఫయిలూ, నలభయిలూ తగలేసి గుడ్డలు కొని కూటికి లేకుండా బతుకుతామా?"

"రెండురోజులు పస్తు పడుకుంటే ఏం? ఇంతలోకే చస్తామా?"

"ఎంతకాలమని ఇలా పస్తులు పడుకుంటాం?"

"అప్పు దొరికేటంత కాలమూ."

"కిందటినెలచివర ఆ శ్రీధరరావు గారి దగ్గర తెచ్చిన బాకీ ఇంకా తీర్చనే లేదుగా. ఇదివరకల్లా ఏమీ తోచకపోతే వాళ్ల లక్ష్మితో కాసేపు కబుర్లు చెప్పతూ గడిపేదాన్ని. ఇప్పడే మొహం పెట్టుకు వెళ్ళను, వాళ్ళ ఇంటికి?"

"సరేగాని ఇహ ఇక్కడినుంచి దయచెయ్యి. నేను రాసుకోవాలి. ఆఫీసువర్కు చచ్చేటంత ఉంది."

గోపాలం విసుగ్గా కసురుతూ అన్న ఈ మాటలకి రాధకి మండింది. కొంపకి రాగానే కాళ్లైనా కడుక్కోకుండా ఆ ఆఫీసు కాగితాలు ముందు వేసుక్కూచోకపోతే తనతో కాసేపు కబుర్లు చెప్పకూడదూ, ఆఫీసులో పొద్దుట్నుంచీ సాయంత్రం దాకా రాస్తూనే ఉంటాడు గద. మళ్ళీ రాత్రినుంచి తెల్లవారేదాకా ఏమిటీ రాత!

"రాత్రింబగళ్ళూ రాసే ఈవెధవ ఉద్యోగం వదిలేసి ఇంతకంటె మంచి ఉద్యోగం వెతుక్కోకూడదూ" రాధ విసుక్కుంటూ అన్నది.

గోపాలానికి కొంచెం కోపం వచ్చింది. తన ఉద్యోగాన్ని రాధ అవహేళన చేస్తోందనిపించిందతనికి. బి. ఎ. పాసయిన తనకి ఈ ఉద్యోగం దొరకటమే ఓ బ్రహ్మప్రయత్నం అయిందని ఆవిడకి మాత్రం తెలీదూ? అన్న ప్రశ్న రావటంతో అతనిలో అంకురించిన కోపం అగ్నిలో పోసిన ఆజ్యం వంటిదైంది.

"మీ నాన్న చేస్తున్నాడులే ఇంతకంటె మహామంచి ఉద్యోగం." అన్నాడతను ఈసడింపుగా.

"ఏం? మా నాన్నకేం?" అన్నదామె సవాలుచేస్తూ.

"అబ్బే. మీ నాన్నకేం?" ఎగతాళిగా అన్నాడతను.

"హాయిగా కాలుమీద కాలు వేసుక్కూచుని మహారాజులా గడుపుతున్నాడు జీవితం." అన్నది తన తండ్రి కరణీకాన్ని ఒక్కసారి స్ఫురణకి తెచ్చుకుని, గర్వంగా.

"అవునవును." అన్నాడతను మరింత ఎక్కిరిస్తూ.

"మరింకేం?"

గోపాలం ఎగతాళి చేస్తున్నకొద్దీ రాధ రెచ్చిపోతోంది. ఆమె తనని ఎవరెన్ని మాటలన్నా పడుతుంది గాని తన పుట్టింటివారి ప్రసక్తి తెచ్చి వారిని అవమానించటానికి ప్రయత్నిస్తే భర్తయినా భరించలేదు. అటువంటప్పుడు తన తండ్రి కరణీకాన్ని తన భర్త ఇంతగా అవమానిస్తుంటే ఆమె విని ఊరుకోగలదా?

గోపాలం నుంచి ఏమీ సమాధానం రాకపోయేసరికి రాధే అంది మళ్ళీ—

"మా నాన్నకి ఆ ఊళ్లో ఎంత పేరుందో మీకేం తెలుసు. ఆయన పేరు చెబితే అంతా గడగడలాడాలిసిందే. మీరు మా నాన్న పేరు చెప్పకుని ఆయన అల్లుణ్ణని ఆ ఊళ్ళో ఏ గడప తొక్కినా మిమ్మల్నెంత ఆప్యాయంగా ఆదరిస్తారో తెలుసునా?"

ఇదేమీ వినిపించుకోనట్టు మొహం పెట్టి గోపాలం ఆఫీసు కాగితాల్లో మునిగిపోయి మౌనం వహించాడు. అతని మౌనం ఆమె

(37-వ పేజీ చూడండి)




# చుక్కలు



శ్రీ బొడ్డుపల్లి పురుషోత్తం

**1**

ఆకాశమను పెద్ద అంగడిలోన
అమ్మబోసినవి రత్నాల రాసులవె
రండు బాలల్లార, రారండు వేగ
కొని తెచ్చుకుందాము గుప్పెట్లు నిండ॥

**2**

ఆకాశమనెడి విద్యాలయమ్మునను
పాఠాలు చదివెడు బాలకులరుగో
రండు బాలల్లార, రారండు వేగ
వల్లెవేయగ మన పాఠాలుగూడ

**3**

ఆకాశమను పెద్ద ఆహవభూమి—
చీకట్లతో పోరు సేన లవేను.
రండు బాలల్లార, రారండు వేగ
పోరాడ మనమును పోడిమిమీర॥

**4**

ఆకాశమను సుందరారామమందు
గుమగుమ వలచెడి కుసుమమ్ములవిగో
రండు బాలల్లార !! రారండు వేగ
కోసుకువద్దాము పూసెజ్జనిండ॥

# అభ్యుదయ చి

## ఆధిపత్యమున జరిగిన ఎ



వెంకటరావు
శ్రీ ఎ. రాధాకృష్ణమూర్తి.

కళ అనేది మానవుని పుట్టుకనుండి అనేక విధాలుగా పరిణామం పొందుతో వస్తోంది. దేశకాల పరిస్థితులను ఆధారం చేసుకొని, మానవునిలోని మానసికమైన హృదయమునుండి ప్రజ్వరిల్లే భావనా (*Feelings*) సంబంధమైన శక్తులు పని చేస్తూ, మార్పులు జెందుతూ వస్తున్నాయి. అట్టిపని చేసే శక్తికే కళ అనే పదం ఉపయోగించ వచ్చు.

పురాతన యుగంలో, అనగా ఆది మానవులలో బండరాతిపై, జింకలు, *Bisons* మొదలగు - అడవిజంతువుల రూపములు ఇంకొక రాతిముక్కను పనిముట్టుగా చేసుకొని, రేఖలలో లిఖించేవారు. ఇది రమారమి 20,000 సంవత్సరాల క్రితం జరిగి ఉంటుందని చరిత్రకారులు అంచనా వేశారు. రానురాను, కుంచెలు, లేపనములు, రాతిని ఒక ఫలకముగా జేసి, చదును చేసి దానిపై చిత్తరువులు వ్రాయడం - ఇంకా నాగరికతను ఆధారం చేసుకొంటూ కాగితాలమీద వర్ణములు పూయడం - ఇత్యాది మార్పులు, సౌకర్యాలు చెందుతూ కళా స్రవంతి (నదము) వస్తూంది. కళా తరంగిణికి హద్దు అనేది లేదు. భావ్య ప్రవాహానికి (*Emotional current*). హద్దు ఏర్పడిందంటే (*Progress*) లేదన్న మాటే; ముందంజ వేయలేదు. అనంత సౌందర్య సాగరాన్ని చేరలేదు. సాంప్ర దాయమనేది - నిన్నటి పద్ధతినే అను రిస్తుంది గాని - నవ్యత్వాన్ని కోరదు.

ఒక కొత్తపద్ధతిని మానవ విజ్ఞానంల తీసుకొన్న తర్వాత వారు మళ్ళీ పా పద్ధతిని అవలంబించరు. గతాన్ని పరి లించి అర్థం చేసుకొనే నవీనులు నూత మార్గాన్ని నడుస్తారు ఈ పై ఉద్దేశాల అండగా జేసుకొనే అభ్యుదయ చిత్ర కారుల సమితి స్థాపితమైంది.

చిత్రకళా ప్రదర్శనమన్నప్పుడు ఎవరి అధ్వర్యాన జరిగినన్నూ, అన్నిపద్ధతు చిత్రములకు అందు ప్రదర్శింపబడుట తావుండవలెను. అన్ని విధము *Mediums* కు స్థాన ముండవలెను.

ప్రస్తుత ప్రదర్శనంలో *Child ar Section* లేదు *Exhibition Cor.* ని వారు *Child art Serious art* తో కలిపి గుచ్చెత్తేశారు. ప్రదర్శనంలో చిత్రాల తగు దూరంలోంచి - చూచి ప్రేక్షకుల వాటిని అనందించడానికి తగిన వీలుండాలి ఒక చిత్రపటం చూచేటప్పుడు ప్రక్క నున్న చిత్రాలు - దృష్టిని లాగకూడదు.. ప్రదర్శనశాలలో చిత్రాలు, కిక్కిరి ఒకటి కొకటి దగ్గరగా ఉంటే ప్రమాదం తప్పదు. 'పదా కోటిజంగాలల్లో ఒక బోడిలింగం, అనే సామెత జ్ఞాపక రాక తప్పదు. ప్రేక్షకులు గుంపుగా ఉంటే, సరదాగా - చిత్రాలకంటే వా



స్కెచ్: శ్రీ ఎచ్. వి. రామగోపల్.



గౌరీపూజ: శ్రీ సూర్యప్రకాశ్ నామదేవ్

# త్ర కారుల సమితి

## మిదవ చిత్రకళా ప్రదర్శనము

క్కువ బాగా ప్రేక్షకులని ఆకర్ష
ించుంగా పలకరిస్తారు. (*Entertain*
ిస్తారు.)

(1) *Purple Girl by P K. Ram*
*ss: decorative type of painting*
ది. టెంపెరా రంగులలో వేయబడింది.
ర్పు (*Composition*) వర్ణవైభవం
ందులోని సొంపు.

(2) *R. K. Devadigar* యొక్క
*Wounded Hearts'* టెంపరా రంగు
లో వ్రాయబడినప్పటికి ఒక క్రొత్త
శైలిలో వ్రాయబడింది. అందులో
ంఖైతో వర్ణములను ఎక్కించు విధానము
ఖ్యంగా గమనించదగ్గది అందులో ఒక
త్తపద్ధతిని ఈ చిత్రకారుడు ఈ
తంలో ప్రవేశపెట్టాడు. ముందు వచ్చే
చిత్రకారులకీ పద్ధతి ఒక పాఠంగా ఉండ
చ్చు.

(3) *K. C. S* పన్నికర్ గారి *Harlot*
నే చిత్రం నూనె రంగులతో వ్రాయ
డింది. ఈ పద్ధతిని చిత్రాలు వ్రాయ
ంలో ఈయనది నలిగిన చెయ్యి. దృశ్య
చిత్రాలలో ఘనుడైనప్పటికి రూపసృష్టిలో
ాడా కౌశలంకల వ్యక్తి.

(4) చిత్రకారుడు *Radhakrishna*
వ్రాసిన 'వెంకట్రావు' అనే రూపచిత్రం -
ూనె రంగులతో వ్రాయబడింది ఇందులో
ాలిక బాగుగా తేబడినది అభ్యుదయ
భావాన్ని బాగా సూచిస్తుంది.

(5) సూర్యప్రకాశ్ నామ్‌దేవ్ యొక్క
గౌరీపూజ *Group Composition* పరిశీ
లించ తగ్గది. ఈ చిత్రకారుడు - ఎక్కువ
*Figures* వ్రాయడానికి ఇష్టపడతాడు.
*Details* వ్రాస్తాడు. చిత్రలేఖనంలో
ఎన్నో చిన్నచిన్న లుగల ఆభరణ విశే
షాలు *Details* ఓర్పు శ్రద్ధలతో చిత్రి
స్తాడు.

ఇంకా ప్రముఖ చిత్రకారుల చిత్రాలు
చాలా ఉన్నాయి వాటినిగురించి ప్రస్తా
వించుటకన్న అక్కడ చూచిన చో
బాగా ఇంపుగా నుండును. యువక
వర్గపు చిత్రకారులు కాకుండా, పేర్గాన
దగిన ప్రముఖ చిత్రకారులు, శ్రీ పి. నర
సింహమూర్తి గారు, కె. శ్రీనివాసులు గారు,
యస్. ధనపాలు గారు, ఆర్. క్రిష్ణారావు
గారు.

ఏ పథాన్ని అనుసరించినను ప్రస్తు
తపు చిత్రకారులు, వాగ్వాదములకు దారి
తీసి - సమితు - మీమాంస తర్కములకు
తావిచ్చి, అందులో కాలం వృధా చేయ
కుండా, వారివారి నిజమనో ఆశయాలను
ఊతగా చేసుకొని ఇతర చిత్రకారులు
ప్రజానీకాన్ని ఉత్సాహానికి తోడు చేసు
కుంటూ, కళాఖండాలను సృష్టించడం
ముఖ్య కర్తవ్యం. తద్వారా కళ - మానవ
నాగరికతకు ఎప్పటికప్పుడు క్రొత్తదనం
యౌవనమైన రూపాన్ని యిస్తూ, సజీవం
చేసి పురోభివృద్ధికి తోడ్పడగలదు. ★

(హెచ్. వి. రామగోపాల్.)



రాచపడుచు: శ్రీ పి. కె. రామదాసు



వేశ్య: శ్రీ కే. సి. ఎస్. పణికర్.



దళితహృదయాలు: శ్రీ ఆర్. కె. దేవాడిగర్.




**జరిగినకథ :**

మాకు బ్రిస్టల్ నగరసమీపంలో ఒక హోటల్ ఉంది. ఒకరోజున మా హోటలుకు 'బిల్' అనే సముద్రపుదొంగ తనతోటి దొంగలనుండి తప్పించుకుని పారిపోయివచ్చాడు. అతడు మా హోటల్లో ఉన్నాడని మిగతా దొంగలకు తెలిసి, అతన్ని చంపేస్తామని బెదిరించారు. అతడు ఆ బెదిరింపుకే భయపడి చనిపోయాడు. అతడు మాకు కొంత డబ్బు బాకీ ఉన్నందున మా అమ్మ, నేను అతని పెట్టె తెరిచి కొంత డబ్బు, ఒక వింతపార్సిలు తీసుకుని సముద్రపు దొంగలనుండి తప్పించుకుని పక్క గ్రామానికి పారిపోయాము. పార్సిలును మా డాక్టరుగారికి, జమీందారుగారికి చూపాను. దాన్ని తెరిచిచూడగా కాంచనద్వీపపటం కనిపించింది. వెంటనే అక్కడి ధన నిక్షేపాలు సంపాదించే ఆశతో అక్కడికి ప్రయాణమయ్యాము.

(బొమ్మలు వాల్ట్‌డిస్నీ ప్రొడక్షన్స, ఆర్. కె. ఓ. రేడియోవారి సౌజన్యంతో)

## 9. కెప్టెన్ స్మాలెట్

హార్బరులో చాలా ఓడలు దాటితేగాని మా హిస్పానియోలా కనిపించలేదు. సరంబీమీది కెక్కగానే మా తండేలు మిస్టర్ యారో ముందుకు వచ్చి శాల్యూట్ చేశాడు. ఏళ్లుపైబడిన మనిషిలాగా ఉన్నాడు. చెవులకు రింగులున్నాయి; ఒక కన్ను మెల్ల; అతనికి, మా జమీందారుగారికి మంచి దోస్తీ ఏర్పడినట్లు గ్రహించాను. కాని మా కొత్త కెప్టెన్‌కి జమీందారుగారికి మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుందని గ్రహించడానికి ఆట్టే సేపు పట్టలేదు.

కెప్టెన్ పేరు మిస్టర్ స్మాలెట్. మహా చిరాగ్గా ఉన్నాడు. దేన్ని చూసినా, ఎవర్ని చూసినా ముఖం చిట్లించుకోవడం, రుసరుసలాడటం. మేము ఓడ గదిలోకి వెళ్లామోలేదో ఒక కళాసీవచ్చి కెప్టెన్ మాతో మాట్లాడ గోరుతున్నాడని కబురు అందజేశాడు.

"అయ్యయ్యో, కెప్టెన్‌గారు మాట్లాడదలచుకుంటే అభ్యంతర మేముంటుంది. చెప్పవలసినవారు ఆయన, వినవలసినవాణ్ణి నేను," అన్నారు జమీందారు ట్రెల్లానీ. గదిబయట కళాసీ వెనకనే కెప్టెన్ వున్నట్లు గ్రహించి కొంచెం ఎగతాళిగా అన్నారీ మాటలు. వెంటనే కెప్టెన్ దూకుడుగా లోపలికి వచ్చాడు. టప్‌మని తలుపులువేసి మా దగ్గిరికి వచ్చాడు.

"కెప్టెన్ స్మాలెట్! ఏమిటి విశేషాలు? అంతా సరిగ్గావుందా?"

"సార్, మీరు ఏమీ అనుకోకుండావుంటే నేను ఉన్నదున్నట్టు చెప్పేస్తాను. నేను లోపల ఒక మాట, బయటికోమాట చెప్పేమనిషినికాదు. నాకీ ప్రయాణం నచ్చలేదు; కళాసీలు నచ్చలేదు; తండేలు నచ్చలేదు—"

"బహుశా ఓడకూడా నచ్చలేదేమో?" అన్నారు కోపం దిగమింగుతూ ట్రెలానీగారు.

"ఓడనిగూర్చి ఇప్పుడేమీ చెప్పలేను—ఎలా నడుస్తుందో ఇంకా చూడలేదుగనుక—"

"బహుశా ఓడ యజమానినైన నేనుకూడా నచ్చలేదేమో?" అన్నారు ట్రెలానీగారు కోపం ఆపుకునే ప్రయత్నం మానేసి.

డాక్టరుగారు అడ్డంవచ్చారు.

"ఆగవోయ్ ట్రెలానీ! ఆగు. తొందరపడితే లాభమేమిటి? సౌమ్యంగా తేల్చుకోవాలిగాని. కెప్టెన్ గార్ని సాంతం చెప్పని. కెప్టెన్! మీకీ ప్రయాణం ఇష్టంలేదన్నారు. ఎందుకని?"

అనువాదం: శ్రీ నండూరి రామమోహనరావు

"నన్ను జమీందార్ ట్రెలానీగారు ఉద్యోగిగా తీసుకునేటప్పుడు, ఓడ ఎక్కడికి వెడుతుందో ముందు చెప్పననీ, ఎందుకు వెడుతున్నామో అసలు చెప్పననీ అన్నారు. నేను ఒప్పుకున్నాను. బాగానే వుంది. కాని తీరాచూస్తే ఓడలోవున్న ప్రతి చిన్న కళాసీకీ నాకు తెలియని విషయాలన్నీ తెలిసిపోయాయి. నేను వాళ్ల ముందు వెర్రిమొహం వెయ్యాల్సివస్తోంది. ఇది న్యాయమేనా అని అడుగుతున్నాను—"

"ఊహూ. న్యాయంకాదు. మీకు చెప్పకుండా ఇతర్లకు తెలియనివ్వడం సబబుగాదు. నిజమే," అన్నారు డాక్టరు లివ్‌సే.

"తరవాత. మనం గుప్తధనంకోసం వెడుతున్నామని తెలిసింది—నాకు మన కళాసీలు చెబితే తెలిసింది సుమండీ. సరే. డబ్బు చాలా చెడ్డది. ఎంత సత్పురుషుణ్ణయినా దుర్మార్గానికి దించుతుంది. గుప్తధనాలకోసం ప్రయాణాలుచెయ్యడం నాకిష్టంలేదు; అందులో రహస్యప్రయాణమనిచెప్పి, ఆ రహస్యం ప్రతి చిలకకీ చెప్పేసినప్పుడు అసలిష్టంలేదు."

"లాంగ్‌జాన్ సిల్వర్ చిలకకేనా?" అన్నారు ట్రెలానీ.

"అహ. దానికాదు. ఊరికే మాటవరసకన్నాను. ప్రతివాడికీ తెలిసిపోయిందేఅని నా బాధ. మీ కెవ్వరికీ తెలియటంలేదుగాని ఈ ప్రయాణంలో మన అందరి చావుబతుకులు తేలిపోతాయి."

"సరే అది మీ అభిప్రాయంకావచ్చు. కాని మేము మీ రనుకున్నంత అజ్ఞానులం, అమాయకులం కాము. తరవాత—కళాసీ లెవరూ నచ్చలేదన్నారు. అంటే వాళ్లకి ఓడపని ఏమీ తెలియదనా?" అని అడిగారు డాక్టరుగారు.

"వాళ్లు నా కిష్టంలేదుసార్. అసలు నా కళాసీలను నేనే చూసుకుని వుండవలసింది."

"నిజమే. వాళ్ల చేత పనిచేయించేది మీరే గనక మీరే వాళ్లని మాట్లాడివుండాల్సింది. అయితే మీతో సంప్రదించేందుకు టైములేక అలా అయిందే

గాని మరేంకాదు. తరవాత—తండేలు ఎందుకిష్టం లేదు ?"

"మిస్టర్ యూరో మంచి నావికుడే; అనుభవమున్నవాడే; గాని అతనికి అధికారికుండాల్సిన గాంభీర్యంగాని, నిగ్రహంగాని లేదు. కళాసీలకు బాగా లోకువైపోయాడు. అతనిమాట ఎవరూ వినేట్టులేరు. పైగా కళాసీలముందు తాగుతున్నాడు."

"తాగకూడదనా, మీ ఉద్దేశ్యం ?"

"అదికాదు. తండేలు అధికారంలో ఉన్నవాడు మిగతావాళ్లతో అంత చనువుగా ఉండకూడదని."

"సరే కెప్టెన్! క్లుప్తంగా చెప్పండి, మీ అభిప్రాయమేమిటో," అని డాక్టరుగారడిగారు.

"మంచిది. నేను మీతో ముందు చెప్పలేదనుకునేరు. అన్నీ చెప్పేశాను. ఏదన్నా జరిగితే దానికి నా బాధ్యత ఏమీవుండదు. వినండి. కళాసీలు మందుగుండు సామగ్రి, ఆయుధాలు సరంబీకింద ఖాళీ జాగాలోకి చేరుస్తున్నారు. ఈ ఓడగదికింద బోలెడు జాగావుంది గదా, అక్కడెందుకు పెట్టగూడదు ?—ఒకటి. మీరు మీ స్వంత నౌకర్లను కొందర్ని తీసుకువస్తున్నారని విన్నాను; వారిని మిగతా కళాసీలు ఉండేచోటనే ఉండమని అన్నారట. వారికి ఓడగది పక్కనస్థలం ఎందుకేర్పాటు చెయ్యగూడదు ?— రెండు."

"ఊఁ. అయిందా ? ఇంకా ఏమన్నావుందా ?" అన్నారు ట్రెలానీగారు ఇంకా కోపంగానే.

"ఇంకొక్కమాట. ప్రతివాడు మన గమ్యస్థానం విషయమే మాట్లాడుతున్నాడు."

"అవును. వాళ్లకి తెలియనివ్వడం పొరబాటు," అన్నారు డాక్టరుగారు.

"మీదగ్గర అదేదో ద్వీపపుపటం వుందనీ, అందులో డబ్బెక్కడుందో తెలిపే గుర్తులున్నాయనీ, అందరికీ తెలిసిపోయింది. ద్వీపం ఏ సముద్రంలో ఏ అక్షాంశ, మధ్యాహ్న రేఖలమీదున్నదో కూడా తెలిసింది," అంటూ కెప్టెన్ స్మాలెట్ వాటి సంఖ్యలను పేర్కొన్నాడు.

"అది నేను పిట్టకూడా చెప్పలేదు," అన్నారు ట్రెలానీగారు విస్మయంతో.

"కావచ్చు. కాని అందరికీ తెలిసిందా విషయం."

"డాక్టర్! నువ్వో, హాకిన్సో చెప్పివుండాలి," అన్నారు ట్రెలానీగారు.

"ఎవరైతేనేం, ఎల్లాగూ వాళ్లకి తెలిసింతరవాత ?" అన్నారు డాక్టరుగారు. ఆయనగాని, కెప్టెన్గాని, నేనుగాని జమీందారుగారి మాటలు లెక్కచెయ్యలేదు. ఎందుకంటే ఆయన నోట్లో నువ్వుగింజ నానదని మాకు తెలుసు. కాని ఈ విషయంలో ఆయనన్నది నిజమే; ఆయనగాని మేముగాని ద్వీపం ఉనికిని ఎవ్వరికీ చెప్పలేదు. అందరికీ ఎల్లా తెలిసిందో మాకూ విచిత్రంగానే వుంది.

"మరొకమాట," అని కెప్టెన్ మళ్లీ ప్రారంభించాడు. "ఆ పటం మీలో ఎవరి దగ్గరుందో నాకు తెలియదు. ఎవరి దగ్గరున్నా, ఆ విషయం నాక్కూడా తెలియకుండా దాచండి. అది మీకిష్టంలేకపోతే నేనీ క్షణంలో రాజీనామా చెయ్యడానికి సిద్ధంగా వున్నాను."

"అర్థమైంది ఇప్పటికి," అన్నారు డాక్టరుగారు. "ద్వీపపటాన్ని రహస్యంగా ఉంచమనీ, ఓడ వెనకభాగాన్ని శత్రువులకభేద్యంగా చెయ్యమనీ, నమ్మకమైనవాళ్లని ఆయుధాలతోసహా వెనకభాగంలో ఉంచమనీ మీరు చెబుతున్నారు. అంటే తిరుగుబాటు జరగచ్చని మీ అనుమానం. అంతేనా?"

"సార్! నేననని మాటలు నాకు అంటగట్టకండి. తిరుగుబాటు జరుగుతుందనితోస్తే ఏ కెప్టెనూ ఓడనడిపేందుకు ఒప్పుకోడు. తడేలు మిస్టర్ యూరో మీద నా కెటువంటి అనుమానమూ లేదు; అతణ్ణి మనం నమ్మవచ్చు. మిగతా కళాసీల్లో కొందరు మంచివాళ్లున్నారు. ఏమో, అందరూ మంచివాళ్లేనేమో, చెప్పలేను. నేనింతగా మీతో చెబుతున్నదెందుకంటే ఈ ఓడ బయలుదేరింది లగాయతు, తిరిగి ఈ హార్బరు చేరుకునేవరకూ మీ అందరి బాధ్యత నాదే. ఏ ప్రమాదం జరిగినా బాధ్యత నామీదే పడుతుంది. కొన్ని జాగ్రత్తలు తీసుకోవలసిందని కోరుతున్నాను. లేకపోతే నేను రాజీనామా చెయ్యటానికి సిద్ధంగాఉన్నాను."



"మీ కిష్టం లేకపోతే నేనీ క్షణంలో రాజీనామా చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను."

"కెప్టెన్ స్మాలెట్! ఇంతేనా మీరు చెప్పేది, ఇంకా ఏమన్నా వుందా? మీరు లోపలికివచ్చినప్పటి అవతారం చూస్తే ఏదో గొప్పవిషయం బయటపెట్టాలని వచ్చినట్లనిపించింది," అన్నారు డాక్టరుగారు.

"అవును, డాక్టర్! నేను రాజీనామా ఇచ్చేసే వుద్దేశ్యంతో వచ్చాను. జమీందారుగారు నామాట పట్టించుకుంటారని అనుకోలేదు."

"ఇక్కడ డాక్టర్ లివ్సే లేకపోతే అదే జరిగేది. సరే మీరు చెప్పింది ఎలాగూ విన్నాను. ఆ ప్రకారమే చేస్తాను. కాని ఇంతవరకూ మీమీద మంచి అభిప్రాయం ఏమన్నావుంటే అ కాస్తా ఇప్పుడు పోయిందని గ్రహించండి," అన్నాడు జమీందారుగారు కర్కశంగా.

కెప్టెన్ వెళ్లిపోయాడు.

"ట్రెలానీ!" అన్నాడు డాక్టరుగారు. "నీ మెదడుమీద నాకెలాంటి నమ్మకంలేదు, కాని మొరికల్లాంటివాళ్ల నిద్దర్ని సంపాదించావు. ఒకడు ఈ కెప్టెన్, రెండోవాడు లాంగ్ జాన్ సిల్వర్."

"సిల్వర్ కేమోయ్, ఫస్టుక్లాసయిన నావికుడు. ఈ కెప్టెన్ అంటే మొదట్నించీ నాకు మంటగానే వుంది, పని తెలిసినవాడని తీసుకున్నాగాని. నా కర్థం కాక అడుగుతాను, ఏమిటా పొగరు మోత్తనం? ఏమిటా తలబిరుసు? ఓడ యజమానితో అల్లాగేనా మాట్లాడ్డం?"

"సరే, చూద్దాంగా."

మేము మళ్లీ నరంబీమీదికి వచ్చాం. అప్పటి కప్పుడే కళాసీలు మందుగుండు సామగ్రిని ఓడగది వద్దకు చేరేస్తున్నారు. కెప్టెను, తండేలు దగ్గరుండి అజ్మాయిషీ చేస్తున్నారు.

ఈ కొత్తఏర్పాటు నాకు నచ్చింది. ఓడ వెనక భాగంలో ఆరు అరలు ఏర్పాటు చేశారు. అవి కెప్టెన్,

మిస్టర్ యారో, హంటర్, జాయిస్, డాక్టరుగారు, జమీందారుగారు ఉపయోగించుకునేందుకు ఉద్దేశించబడినై. కాని తరవాత అది మార్చారు. కెప్టెను, మిస్టర్ యారో ఓడముందుభాగంలో ఉండేందుకు ఒక చిన్నగదిలాగా ఏర్పాటు చేశారు; అందులో రెండు అరలుకట్టారు. వెనకభాగంలో ఖాళీ అయిన రెండు అరల్లో ఒకటి నాకూ, ఒకటి రెడ్రూత్ కూ ఇచ్చారు.

కళాసీలు పనిలో నిమగ్నమైవున్నారు. నేను కూడా వాళ్లకి సాయపడుతున్నాను. ఇంతలో మరిద్దరు ముగ్గురు కళాసీలతో కలిసి లాంగ్ జాన్ వచ్చాడు. అతను రావడం మేమెవ్వరం చూడలేదు. కుంటు కుంటూ వచ్చి మా పక్కనునుంచున్నాడు. జరుగుతున్న దేమిటో గ్రహించగానే ఇలా అన్నాడు:

"ఏయ్, ఏమిటీ ఇదంతా ? ఎక్కడికి తీసుకెడుతున్నారు ఆ తుపాకులు, కత్తులూ ?"

"కిందకి తీసుకెడుతున్నాం. ఓడ గదికింద జాగా వుందిగా?" అన్నాడొకడు.

"అరె. ఎవడు చెప్పాడురా మీకు? ఇప్పుడీ పని పెట్టుకున్నారప్పుంటే ఎల్లా?"

"సిల్వర్! నేనే ఆజ్ఞాపించాను. నువ్వు కిందకు వెళ్లు. వంట సిద్ధంచెయ్యి. భోజనాలవేళ అవుతోంది." అన్నాడు కెప్టెన్.

"వెడుతున్నానండి సార్!" అన్నాడుసిల్వర్. కాని వెళ్ళడాని కిష్టంలేనట్లు అక్కడే ఒక నిమిషం నిలబడ్డాడు.

"సిల్వర్ చాలా మంచివాడండి. ఏమంటారు కెప్టెన్?" అన్నారు డాక్టరుగారు మెల్లిగా.

"కావచ్చు!" అన్నాడు కెప్టెన్ స్మాలెట్. "ఏయ్, నెమ్మదిగా, భద్రం, భద్రం," అని కళాసీలను హెచ్చరించాడు. ఇంతలో ఆయన నన్ను చూశాడు. నేను పరధ్యానంగా తెరచాప తాళ్లు పట్టుకుని లాగుతున్నాను.



నేను శాల్యూట్ చేసి వెళ్లిపోయాను

"ఏయ్, కుర్రాడా? అది వదిలెయ్.. చేతు లూరుకోవా? పో కిందికి పో. సిల్వర్‌కు ఏమన్నా కావాలంటే అందిస్తూవుండు," అని అధికారస్వరంతో ఆజ్ఞాపించాడు.

నేను శాల్యూట్ చేసి వెళ్లిపోతుండగా, కెప్టెను డాక్టరుగారితో చెప్పాడు:

"నా ఓడమీద ఒకళ్లు ఎక్కువ, ఒకళ్లు తక్కువ అని ఉండటానికి ఒప్పుకోను. నాకందరూ సమానమే."

కెప్టెన్‌మీద ఎంత రోతపుట్టిందో చెప్పలేను. జమీందారుగారి అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవించాను: ఈ కెప్టెన్ నిజంగా పొగరుమోతు వాడే.

(ఇంకావుంది)













# ఎవరి ప్రాణం వారికి తీపి

శ్రీ కలిగ్గర నరసింహమూర్తి

పూర్వం ఒక పల్లెటూరిలో ఒక ముసలావిడ, ఆవిడ కొడుకు, కోడలు, మనుమడు ఉంటూ ఉండేవారు. ఒకనాడు కర్మవశాత్తు ఆముసలావిడ మనుమడు పాము కాటువల్ల చనిపోయాడు. పాపం ఆఇంటి వారంతా ఆకుఱ్ఱవాడి మీదపడి ఏడుస్తూ, "అయ్యో! దేముడా! మాలో ఎవరినైనా తీసుకు పోకుండా, ఈ ముక్కు పచ్చలారని పిల్లవాణ్ని తీసుకుపోవటానికి నీ చేతులు ఎట్లా వచ్చాయిరా!" అని దేవుణ్ని నిందిస్తూ గోల చేస్తున్నారు.

కలహ భోజనుడైన నారదుడు, అదృశ్య రూపంతో, ఈకుటుంబం గోలవిని మనస్సులో చింతించి లయకారుడైన శంకరుని వద్దకు వెళ్లి, "స్వామీ! ముక్కు పచ్చలారని పసి బాలుణ్ణి చంపటంకన్నా, ఆకుటుంబంలోని ఇంకొకరిని తీసుకొని పోగూడదా! ఆకుటుంబం యొక్క బాధ గమనించండిస్వామీ!" అని అన్నాడు నారదుడు ఎంతో జాలిగా.

పరమేశ్వరుడు చిరునవ్వు నవ్వి, నారదునితో "నారదా! ఎవరి ఆయుర్దాయం చెల్లితే, వారు భూలోకాన్ని విడిచి రావలసిందే! అంతేగాని వారికిబదులు ఇంకొకరు రావటం భావ్యంకాదు. అయినా, ఒకరి ప్రాణంకోసం ఇంకొకరు ప్రాణాన్ని అర్పిస్తారా! అసంభవం నాయనా!" అని అన్నాడు.

నారదుడు మాత్రం అందుకు ఒప్పుకోకుండా "కాదు స్వామి! కాదు. ఎవరిసంగతి ఎలా ఉన్నను, ఆకుటుంబంసంగతి మాత్రం అలా ఉండదు. ఆకుఱ్ఱవాణ్ని బ్రతికిస్తే, తమలో ఎవరి ప్రాణాన్ని ఐనాసరే, వదిలేయడానికి సిద్ధంగా ఉంది ఆకుటుంబం. వారి వంశోద్ధారకుడు పోయినతర్వాత వారిజీవితంనిష్ఫలం కదా స్వామీ! వారిపై కరుణించి, వారికి వంశభిక్ష పెడితే, వారి ఆనందానికి అడ్డేఉండదు. ఆతర్వాత వారిలో మీ ఇష్టంవచ్చిన వారిని తీసుకుపోవచ్చునుగదా స్వామీ!" అని నారదుడు అన్నాడు.

భగవానుడైన శంకరునికి తెలియని విషయం అంటూ ఉంటుందా! కానీ నారదుని మొండివాదనకు శంకరుడు నవ్వి "సరే! నారదా! వారిఇష్టము ప్రకారము ఆకుఱ్ఱవానిని బ్రతికించి, ఆకుటుంబంలోని వేరొక ప్రాణిని ఆబాల ప్రాణికి బదులు తీసుకుందాం. కానీ నారదా! ఆకుటుంబంలోని ఒక్కరూ కూడా, ఆబాల ప్రాణికోసం తమ ప్రాణాన్ని ఇవ్వటానికి అంగీకరించరు." అని అన్నాడు శంకరుడు. నారదుడు, విజయగర్వంతో "తినబోతూ రుచిఅడగటం, ఎందుకుస్వామి!" అన్నాడు.

పాపం ఆ ఇంటి వారంతా ఆకుఱ్ఱవాడి కోసం ఎంతగానో, ఎడుస్తూ, మొత్తుకుంటున్నారు. ఇంతలో ఒక యోగీశ్వరుడు తన శిష్యునితోసహా, అక్కడకు వచ్చి ఆదుఃఖానికి కారణం తెలుసుకున్నాడు. వారిద్దరూ ఎవరనుకున్నారు? ఆ యోగియే శంకరుడు. ఆశిష్యుడే నారదుడు.

ఆ యోగీశ్వరుడు ఆ ఇంటివారిని ఓదార్చి ఆకుఱ్ఱవాని శవాన్ని పరీక్షించి "అమ్మా! ఈ కుఱ్ఱవాడు బ్రతకటానికి అవకాశం ఉంది. కానీ ఆ కుఱ్ఱవాడు జీవించాలంటే, మీలో ఎవరైనా ఈబాలునికి బదులు మరణించాలి. మీకు సమ్మతమేనా' అని అన్నాడు. ఈ మాటలు విని నేను మరణిస్తానంటే, నేను మరణిస్తానని అంటా

రేమోయని నారదుడు అనుకున్నాడు. కానీ అలా జరుగలేదు. పైగా వారంతా యోగీశ్వరుని మాటలువిని ఒకరిముఖం ఒకరు చూసుకుంటున్నారు.

యోగి మొట్టమొదట ముసలావిడ దగ్గరకువెళ్లి "అవ్వా! నీకు సుమారు 70 ఏళ్లు నిండాయ్. నీకు ఇంకా ఈ ఇహలోక కష్టసుఖాలు ఎందుకు? చక్కగా చనిపోయి ఈ వంశోద్ధారకుని బ్రతికించుకోకూడదా!"అని అన్నాడు.

అందుకు ఆ అవ్వగారు "అయ్యో! నాయనా! నేను చనిపోవటానికి సిద్దమే! కానీ నాకు రామేశ్వరయాత్రకు వెళ్లాలనిఉంది. ఆకోరిక తీరినవెంటనే కావలిస్తే వచ్చేస్తా! అని అన్నది.

యోగి ఈవిడతో లాభంలేదని, ఏడుస్తున్న తండ్రివద్దకు వెళ్లి ఏమండీ! మీరు ఈ నలభై ఏళ్ల వయస్సులో సంసారంకోసం ఎన్నో బాధలుపడి ఉంటారు. చక్కనివాడు గుణవంతుడుఐన ఈ వంశోద్ధారకుని పునర్జన్మకోసం మీరు చనిపోకూడదా! అని అన్నాడు.

అందులకా తండ్రిగారు "యోగీంద్రా! నేను చనిపోవటానికి అభ్యంతరం లేదుగాని, రైతుల వద్దనుండి ధాన్యం తెచ్చుకోవాలి. దూరపు బంధువులవద్ద నా డబ్బంతా దాచాను. నేను చనిపోయానని తెలిస్తే రైతులు ధాన్యాన్ని, బంధువులు ధనాన్ని ఎగవేసేస్తారు. అంతేకాక నా భార్యకు వైధవ్యబాధను కలిగించటం నాకు ఇష్టంలేదు. ఎలాగండి!" అని అన్నాడు.

ఇక ఈయన గారితోకూడా లాభంలేదని యోగి తిన్నగా ఆ బాలుని కన్నతల్లి వద్దకు వెళ్లి "అమ్మా! పునిస్త్రీ మరణం ఎంతో పతివ్రతలకుగాని లభించదు. అటువంటి అవకాశం నీకు ఇప్పుడు లభించింది. వంశోద్ధారకుడైన, పుత్రునికోసం నీప్రాణం అర్పించరాదటమ్మా! అని అడిగాడు.

అందుకు ఆ తల్లి "స్వామీ చావటానికి నేను జంకటం లేదుగాని, నాకు పదహారుఫలాల నోము చేయాలని లక్షవత్తుల నోముచేయాలనిఉంది. అంతేగాక కొడుకుపోతే ఇంకొకకొడుకు పుడతాడు. వాడి పెళ్లి, పిల్లల్నిచూసి ఆనందించాలని ఉంది. నేనెలా చనిపోతాను నాయనా!" అని అంది.

నారదుడు వీరిమాటలు విని ఆశ్చర్యపోతూ ఉండగా, శంకరుడు "వెఱ్ఱివాడా! ఎవరిప్రాణం వారికి తీపి. ఒకరికోసం ఒకరు చనిపోతారా నాయనా!"అని అంటూ ఇద్దరూ మాయమయ్యారు.





# సుడిగాలి

(18-వ పేజీ తరువాయి)

వున్నట్టుగా తోచింది రామారావుకు దారి ఎక్కడా కనిపించలేదు. తాను నిల్చోడానికీ, భార్యా బిడ్డలికి పూతయివ్వడానికి మరి అవకాశమే లేదనుకున్నాడు. ఈ నష్టాన్ని పూరించేందుకు, గుండె నిబ్బరం చేసుకుందుకూ వేరే వుపాయమంటూ స్ఫురించనే లేదు. తాను పడబోయేపాట్లు వుండనే వున్నై. పెళ్లాం, పిల్లలగతేం కాను? తాను జీవించివుండగా వాళ్ల దుఃఖం చూసి భరించడమేనా? అంతకంటే నీచమింకే ముంటుంది!...అంతవరకూవొస్తే ఆత్మహత్య చేసుకుంటేనే మేలు. ఈ తుది నిశ్చయం చేసుకునే ముందుగా యింటిలోని ప్రతి వస్తువునూ ఇరికించి చూస్తున్నాడు వారి కుటుంబాన్ని యిలాంటి సర్వనాశనం నుండి తత్కాలికంగానైనా తప్పించడాన్కి ఏదైనా వుపకరించదా అని. కాని ఇల్లంతా శూన్యంగా వుంది. పనికొచ్చేది ఒక్కటీ లేదు. తనకు తెలియాం దేముం దక్కడ!

ఛీ! ఛీ! కానీకి కొరగాని బ్రతుకు బ్రతికేందుకేనా జన్మమెత్తింది. ఇంత చదువూ చదవడం ఆఖర్కి బికారివాడిగా తయారుకావడంకోసమా? చదువుకొంటున్నప్పుడు ఎన్నెన్ని కోర్కెలుండేవి! ఎంతెంతలేసి ఆశలు పెట్టుకున్నాడు! ఆనాటి వూహా జీవితానికీ, యీనాటి అనుభవ జీవితానికీ ఎక్కడా అతకదేం! అప్పటి రామారావుకూ, యిప్పటి రామారావుకూ ఎక్కడైనా పృథాపోలిక! లోకమెంత నిష్ఠూరంగా, అసత్యంగా మారిపోయిందో! తనలాంటి నికృష్ట నిరాశజీవితాన్ని చవి చూస్తున్నవారు యింకొకళ్లెవళ్లయినా వుంటారా యీ ప్రపంచంలో! లేక ఏ వుపాయాంతరమూ, ఏ సహాయమూ లేని మందభాగ్యుడు తానొక్కడేనా? తాను జన్మమెత్తిందీ ప్రత్యేకానుభవంకోసమేమో! ఇంతకంటే ఓ జంతువుగానో, ఓ పిట్టగానో పుట్టివుండకూడదూ! కష్టసుఖాల్ని చేతనైనంతమట్టుకు అనుభవించడమే తెలుస్తుంది కాని, దాని మంచిచెడ్డలు విమర్శించి, ఆవేగమూ, ఆ వేదనా, పొందే జ్ఞానము లేకుండా పోను. అంతేకాదు. వీరు నా అనుచరులు, వీళ్లని పోషించడం, సుఖపెట్టడం నా కర్తవ్యం అన్న ఆలోచన లేకుండా, సమయాసమయాల విచక్షణ లేకుండా, ముందుకు కూడబెట్టి దాచాలన్న చింత లేకుండా, దొరికిన దాంతో సంతుష్టి పొందుతూ, హాయిగా నిర్విచారమైన స్వేచ్ఛా జీవితం గడిపి వుండును. పుణ్యం చేసిన జీవులు మనుష్యులై పుడతారని ఎవడి పుర్రెలో పుట్టిందో కాని అంతకంటే సర్వాబద్ధం యింకొకటి లేదు. పాపమే మానవ జన్మకు పునాది. స్వతంత్రతాయుతమైన పశుపక్ష్యాదుల జన్మకు పుణ్యమే కారణము.

* * *

ప్రాణాలువున్నాయా, పూడిపోయాయా అన్నట్టు నిశ్శబ్దంగా పడివుంది శారద. చీర కొంగు చేతికి చుట్టుకుంటూ తల్లి ప్రక్కను కూర్చుంది సరోజ బిక్క మొహం వేసి. ఆ దృశ్యం చూసి రామారావు కళ్లంట అశ్రువులు కాదు రక్తపు చుక్కలు రాలాయి. అక్కడ కూర్చొని వుండడాన్కి వశం కాక లేచి వెళ్లిపోయాడు పైకి.

తిరుగుతున్నాడు పిచ్చివాడిలాగ. ఏమి చెయ్యటానికీ తోచడంలేదు. తన కిప్పుడు కావలసింది డబ్బు...ఎన్నో ప్రయాసలు పడి తెచ్చిన డబ్బు, నెలరోజులు తన రక్తాన్ని చిమ్మి గడించిన డబ్బు, జీవనాధారానికి మూలమైనడబ్బు, ఒక్క క్షణంలో తనకి కాకుండాపోయింది. అది పోవడంతో సరిపోయిందీ, దాంతో తన విలువ కూడా పోయింది. మరొక్క కానీ సంపాయించడాన్కి తనకు విలువలేదు. మిగిలి పోయింది తనశరీరమే...ఈ శరీరాన్ని ముక్కముక్కలుగా కోసి అమ్మితే ఎవరైనా కొనుక్కుంటారేమో! అబ్బె! మానవ శరీరం తగలబెట్టడాన్కి తప్ప మరెందుకూ పనికిరాదు. పనికొచ్చేదంతా ఆ శరీరంలోని నరనరాల్లో ప్రవహించే కవోష్ణరక్తం. ఆరక్తాన్నప్పుడే పిండుకొని వడబోసుక త్రాగుతున్నారు చుక్క చుక్కలు చప్పరిస్తూ జీతమిచ్చి కొనుక్కున్న ధనవంతులు.

మనిషియొక్క విలువ కట్టడం ఆ ధనవంతుల చేతిలోని పని. తన్నక చచ్చినా వాళ్లు నిర్ణయించిన విలువకొక దమ్మిడీ హెచ్చుగా యివ్వరు. జీతగాళ్ల అవసరానవసరాల్లో వాళ్లకి ప్రమేయం లేదు...పర్సు దొంగిలించిన దొంగనైనా వీళ్లకన్నా మెరుగే అనుకోవచ్చును. తన పరిస్థితులు తెలియక పైవేషం చూసి భ్రమపడి దొంగిలించివుంటాడే కాని దానివల్ల ఒక కుటుంబం దుంప నాశనం అయిపోతుందని తెలిస్తే అంత సాహసం చేస్తాడా అన్న సంశయాన్కి తావు లేకపోలేదు. ఈ ధనవంతుల మాటన్నారూ, అరవచాకిరీ చెయ్యించుకొని మహాప్రసాదమని పారేస్తారు వాళ్లకి తోచిందేదో అన్యాయమని తెలిసి తెలిసి. ఇనప్పెట్లు నింపుకోడమే ముఖ్యం కాని, నౌకర్ల కడుపుమంట వాళ్ల కక్కరలేదు. ఉన్న శక్తినంతా పిండి పనిచేయించుకున్న తరవాత

తిండికైనా చాలని వేతనాలిచ్చేవార్ని ఏ తెగలో చేర్చాలి? దొంగలకన్నా నీచులంటే తప్పా! దొంగతో వ్యాపారం ఒక్క రోజులో తెమిలిపోతుంది కాని వీళ్లతో వ్యవహారం జీవితాంతం వరకూ సాగవలసిందే.

విసుగుదలా, చింతా వున్న వాళ్లకి కాలం ముందుకు సాగనే లేదన్న అపోహ కలుగుతుంది. టైం ఎంతయిందో తెలుసుకుందామనే ఆదుర్దా కూడా వుంటుంది. సహజంగా...ఎన్నిగంట లయిందో అని వాచీ చూశాడు రామారావు. చటుక్కున ఒక ఆలోచన పొటకరించింది మెరుపులాగ. ఇంతవరూక్క ధ్యానమే లేకపోయింది తన చేతికి వాచీవున్నట్టు. ఇల్లంతా గాలించి విడిచిపెట్టినప్పుడు కాని, అనేక ఆలోచనల్తో బుర్ర పాడుచేసుకున్నప్పుడు కాని తన ఒంటిమీదనే సమయానికి సహకరించే వస్తువు ఒకటుందని తట్టనేలేదు. కొన్ని కొన్ని సమయాల్లోనూ, పరిస్థితుల్లోనూ, మెదడుకి మాంద్యంపట్టి, దేన్నో వెతుకులాడ్డంతోనే సరిపోతుంది కాని, సమీపంగా అందుబాటులోవున్న వేవీ జ్ఞప్తికి రావు వెంటనే; తన్నుతాను మర్చిపోవడం కూడా తటస్థిస్తుం దొకక్కప్పుడు... దాహంతో ఎడారిలో తపిస్తున్న వాడికి అనుకోకుండా నీళ్లు దొరికినంత సంతోషం కలిగింది. ఆ ఆలోచన పుట్టగానే ఆనంద రేఖ మెరిసింది మొహంలో.

వాచీలషాపు వరకూ వెళ్లేడు వుత్సాహపడుతూనే. కాని తీరా దుకాణం సమీపించీ సరిక్క గుండెలు దడదడ కొట్టుకొన్నై ఏదో కాని పని చేస్తున్నట్టు. వాచీని అమ్మివెయ్యడమేనా అనకున్నాడు. తన జీవితానికీ, గడియారానికీ, ఒకవిధమైన లంకె పడిపోయింది. ఏ క్షణంలో ఏపని చెయ్యాలో, ఎప్పుడు ఎక్కడుండాలో, ఎక్కడకు వెళ్లాలో అన్నీ గడియారం చూసుకొనే నిర్ణయించుకొనేవాడు. అది తన దగ్గిర లేకపోతే చెయ్యి విరుచుకున్నట్టుగా వుంటుంది. ఎప్పుడు ఎంతవేళైందీ తెలుసుకోడమే కష్టం. దైనందిన వ్యవహారంలో అదొక తీరని లోటు...ఒకపని చెయ్యడాన్కి పూనుకొనేటప్పుడు ఏ అరమరా లేకపోవడం, అది క్రియారూపంలో పెట్టేటప్పుడు వెనుకాడడం చాలామందికి మామూలే.

ఛ! ఛ! చేతివాచి అమ్ముకోడం నామర్దాపని...ఎక్కడైనా తాకట్టు పెడితేనో?...అది మాత్రం ఏం పరువైనపని, అమ్మేస్తే ఆకీడు అప్పటితో చెల్లు. ఎంత నీచానికైనా ఒడబడక తప్పదు డబ్బు అవసరమైనప్పుడు. మరోలా, మరోలా కాకుండా తన వస్తువు అమ్ముకుంటే ఎందుకూ హీనత?

రెండడుగులు వెనక్కి వేసినవాడు మళ్లీ ముందుకు పోయి షాపులో ప్రవేశించాడు తెగించి.

'మీ దగ్గిర వెస్టెండు వాచీలు వున్నాయా?' అని అడిగాడు దర్జాగా.

'బాబూ! మీరు పేరు కోసం దేవులాడి డబ్బు తగలెడతానంటే నేను చెప్ప లేను కాని, వాటికన్నా మంచివీ, చౌకలోనివీ, కావాలంటే చూపిస్తాను రండి!' అన్నాడు షాహుకారు చిరునవ్వుతో.

'వెస్టెండువి అసలు మీరు తెప్పించరా?

'తెప్పించకపోవడమేమిలెండి... బోలెడుధర...అయినా యిప్పుడవి...'

'దొరకడంలేదా ఏమిటి?'

'అనగానే దొరకవండి, ముందుగా వాటికోసం పేరు రిజష్టరీ చెయ్యించుకోవాలి.'

'నాకోటి తెప్పించి పెట్టగల్రా?'

'ఓ! అలాగే! మీకేదికావాలో చెప్పండి. సెకండస్సా, కీప్సేకా, సోవర్ప్రైమా?'

'మరి నాదగ్గిరోటుంది. అది మీరు తీసుకుంటారా?'

'సరేలెండి. అప్పుడు పట్టుకొస్తే చూసుకుందాం!'

'ఇక్కడే వుంది. చూపించమంటే చూపిస్తాను.'

'ఏమిటో పాతవి చెల్లుబడి కావు బాబూ'

'మీకు మార్గమే లేకపోతుందా ఏమిటి. కొత్తది కొనుక్కుంటే నే నేమి చేసుకోవాలి దీన్ని.'

'మాకమ్మితే మీకేమి లాభం బాబూ! మేమివ్వగలిగింది పదోపాతికో తప్ప మీకు తృప్తిగా వుండదు. అదే మీ స్నేహితుల కెవరికైనా అమ్ముకుంటే...'

'మీరు కొంటారా? మీరు కొంటారా?' అని ఎంతమంది స్నేహితుల దగ్గిరకని వెళ్లేది? మీరే న్యాయమైన ధరకట్టి పుచ్చుకోండి.'

'ఏదీ? యిలా యివ్వండి దాన్నొకసారి'

రామారావు వాచీ యిప్పి బల్లమీద పెట్టాడు. షాహుకారు దాన్ని అటు తిప్పి యిటుతిప్పి, మళ్లీ బల్లమీదనే పెట్టేశాడు. మొహంలో ఏ విధమైన భావమూ కనపడనివ్వలేదు.

'రెన్నాళ్లబట్టి ఓ ఆసామీ రోజూ తిరుగుతున్నాడండి వెస్టెండువాచీ యిస్తే కేటలాగు ధరమీద అర్థమం పాతిక రూపాయిలైనా యిస్తానని. ప్రొద్దుటే వచ్చి పోయాడు. నేనింకొకళ్లకోసం తెప్పించి వుంచింది యిచ్చెయ్యమని నానా మొగమాటం పెడుతున్నాడు. నేను ఒప్పుకోలేదు... చూడండి బాబూ! ఒకర్ని చూస్తే మొత్తబుద్ధి, యింకోకర్ని చూస్తే పెట్టబుద్ధి...మీమీద నాకెందుకో అభిమానం కలిగింది.

ఇంటిముందు కారు ఆగగానే రామారావు ముందుగా దిగి, డాక్టరుగారు దిగేందుకు తలుపు తెరిచి నిలబడ్డాడు ప్రక్కకు ఒదిగి. దిగినవెంటనే చేతిపెట్టె పట్టుకొని ఆయన వెనకాతలే వెళ్లాడు యింటిలోకి. ఆ వెంటనే కుర్చీఒకటి తెచ్చి వేశాడు శారద మంచానికి సమీపంగా డాక్టరుగారు కూర్చుండుకు. ఈ మర్యాదలన్నీ యింటికి వచ్చిన డాక్టర్లకు జరగాలని తెలుసుకున్నాడు యింతకుముందు ఒక్కసారి ప్రక్కనున్నవాళ్లింటికి డాక్టరు వచ్చినప్పుడు చూసి. అందుచేత ఆదంతా తన స్వంత అనుభవానికి తెచ్చుకున్నాడు యథాతథంగా. ఆయన పరీక్షచేసి మధ్యమధ్యను అడుగుతున్న ప్రశ్నలకు జబాబు చెబుతూ వున్నాడు వినయంగా మాట్లాడుతూ.

'గాబరాపడవలసినంత ప్రమాదమేమీ లేదు. మీరు భయపడకండి' అన్నారు డాక్టరుగారు.

'చిత్తం. చిత్తం.' అన్నాడు రామారావు. 'మీ రెప్పుడైతే వొచ్చారో అప్పుడే నా భయమంతా పటాపంచలై పోయింది.' అన్నాడు మళ్ళీ, గొంతు సవరించుకొంటూ, లేని చిరునవ్వు తెచ్చుకుంటూ.

తరవాత డాక్టరుగారు శారదకొక యింజక్షను యిచ్చారు, మందు తమ చేతిపెట్టెలోదే తీసి. ఒక కాగితంమీద ఏమిటేమిటో వ్రాసి—

'ఈ మందులు తెచ్చి యిందులో వ్రాసిన ప్రకారం యివ్వండి' అని రామారావు చేతికిచ్చారు. రామారావు అది తీసికొని మీదికీ, కిందికీ పరకాయించి చూశాడొక్కమాటు. ఏదో సంశయం కొట్లాడుతోంది మనసులో.

'తమ హాస్పిటలునుండే తెచ్చుకోమన్నారా యీ మందులూ!' అని అడిగాడు కొంచెం జంకుతూ.

'మా షాపులో కూడా అమ్ముతామనుకోండి...అది మీ యిష్టం...అక్కడే అన్నమాటేమిటి.'

'మీకు ఎక్కడ వీలైతే అక్కడే కొనుక్కోవచ్చు' అన్నారు డాక్టరుగారు విపులీకరించి. రామారావు తెలతెల్లపోయాడు; చెక్కితే రక్తంలేదు మొహాన్ని...మందులు కూడా కొనుక్కోవాలీ!...మరి యీయనగారు వచ్చి చేసిన మెహార్బానీ ఏమిటో?...రోగులే మందులు కూడా కొనుక్కొని త్రాగేటట్టయితే, ఆ వున్న హాస్పిటలూ, కంపౌండరూ ఎందుకూ తగలబెట్టనా!

డాక్టరుగారు చేతిపెట్టె సర్దుకుంటున్నారు వెళ్లిపోదామని.

'తమఫీజూ!' అని అడిగాడు రామారావు దించినతల ఎత్తకుండా.

'పదిహేను, ఇంజక్షంది ఐదు, మొత్తం యిరవై.' అన్నారు డాక్టరుగారు నిశ్చలంగా.

రామారావు శరీరం గజగజా వొణుకుతోంది. టేక్సీవాడికివ్వగా మిగిలిన రెండు నోట్లూ, పదేసి రూపాయిలవి, తీశాడు జేబులోంచి. కాని చేతులు తిమ్మెర్లుపట్టి, పట్టు దొరక్క జారిపోయాయి నేలమీద. అందుకుందామని కిందికి వంగబోయి తూలిపోయాడు.

'పరవాలేదు నేను తీస్తానులెండి!' అని డాక్టరుగారు అవి అందుకొని జేబులో భద్రపరుచుకున్నారు విప్పి చూసుకొని. తరవాత చల చల్లగా జారిపోయారు పైకి చేతిపెట్టి వాశేపట్టుకొని.

'అబ్బా!' అని బాధతో యిటు నుంచి అటు ఒత్తిగిల్లింది శారద. గుడ్లనిండా నీరు త్రిప్పుకొని తండ్రివైపు చూస్తోంది సరోజ రెప్పవెయ్యకుండా. తల్లి దురవస్థకు దుఃఖిస్తోందో, బిస్కత్తులు తేలేదని ఏడుస్తోందో అర్థం చేసుకోలేక పోయాడు రామారావు ఆ చిన్న పిల్లని...గుండెలు బరువెక్కినై. చేతులూ కాళ్లూ విలవిలలాడిపోయాయ్, విపరీతంగా నొప్పెడుతోంది తల. చేతితో గట్టిగా కణతలు నొక్కుకున్నాడు. నేలమీద కూలబడిపోయాడు ఇహ మందులెట్లా కొనడమని.

'రుంయి' మని గాలి తెర విసిరింది. డాక్టరుగారు వ్రాసియిచ్చిన మందులజాబితా కొట్టుకుపోయింది రెపరెపలాడుతూ. దీపం ఆరిపోయి అంధకారంలో మునిగిపోయింది గది. రెండు చేతులా కళ్లు నులుముకున్నాడు రామారావు కంటిలో దుమ్ముపడి. ★

# జీవితరేఖ

(22-వ పేజీ తరువాయి)

కోపాన్ని మరింత రెచ్చకొట్టింది. తను చెప్పేదంతా తనభర్త చెడచెవిన పెడుతూన్నాడని తెలుసుకున్న ఆమె కోపం ఆకాశాన్నంటింది.

"అక్కడ రైతులు ఒద్దంటున్నకొద్దీ కూరలూ, పళ్ళూ అన్నీ కొట్లు కొట్లుగా తెచ్చి పడవేస్తారు. ఈ కొంపలో కొందామన్నా చిల్లుకానికి కూడా కరువే నయ్యె ఖర్మ."

ఈసారి గోపాలానికి మండింది. ఆమె ముఖం వంక సీరియస్‌గా చూస్తూ, అన్నాడు—

"ఆ దోపిడీ కూడు తినకపోతే నేం?"

"దోపిడీ కూడేమిటి?" అన్నదామె మొహం ముకుళించుకుని.

"అదే ఆ రైతుల చెవులు పిండి వసూలు చేసేది."

"చెవులుపిండ డేం వసూలు చెయ్యటం లేదు. వాళ్లు ఇష్టంకొద్దీ ఒద్దంటున్నా తెచ్చిపడేస్తే తీసుకోక తప్పతుందా మరీ."

"పాపం. ఇష్టం కొద్దీ ఒద్దంటున్నా తెచ్చి పడవేస్తున్నారేం?" అన్నాడతను హేళనగా.

"లేకపోతే?"

"లేకపోతే వాళ్లగుడిశ లక్కుండగలదా - లేకపోయినా మళ్లా ఏడు వాళ్ళకా పొలం కౌలుకు దక్కుతుందా?- అయినా ఈరోజుల్లో ప్రతివాడు ఏదో పనిమీద పాకులాడే వాడే కానీ, నిజంగా వినయవిధేయతలుండి పూజించేవాడెవడు? ఇటువంటివాళ్ల కూడు తిని మీ నాన్న ఏం బాపుకుని ఎంతకాలం బతుకుతాడులే."

రాధ మరింత మండిపడింది.

"మా నాన్న నెన్నెప్పుడూ వల్లెత్తు మాట అనెరగడు."

"పాపం. నేను రోజూ నిన్ను కొరుక్కుతింటున్నాను గదూ." ఈమాటలు విన్న రాధ ఉద్రేకానికి పట్ట పగ్గాలు లేకపోయాయి. ఆమె ఉద్రేకంలో తన శరీరాన్నే మైమరచింది. కోపంతో పళ్లు బిగబట్టి నిప్పులు కక్కుతున్న కళ్లతో అరిచింది—

"మీ నాన్న రెవిన్యూ డిపార్టుమెంటులో పనిచేసి అంత లంచం తిని ఎంతకాలం బతికాడేమిటి. పోనీ మనకి చిల్లి గవ్వ మిగిల్చింది లేదుగా. పైగా మా నాన్న నంటారెందుకూ?"

"రాధా." అని గద్దించాడు గోపాలం కోపంతో.

"ఏమిటి?" అంది రాధ.

"నోరుముయ్యి."

"ఎందుకు ముయ్యాలేం?" అగని ఆవేశంతోనూ, దుఃఖంతోనూ అంది ఆమె.

"ముందు నోరుమూసుకుని అవతలకి నడుస్తావా లేదా?" మరింత కోపంతో కుర్చీలోంచి లేచి ముందుకొచ్చాడు గోపాలం.

రాధ ఇక మాట్లాడలేక ఎక్కిక్కి ఏడుస్తూ అక్కడినుంచి వెళ్లిపోయింది. గోపాలం మళ్ళా కుర్చీలో కూలబడ్డాడు. అతనికా కాగితాల మీదికి మళ్లీ మనసు పోలేదు. అతని ఆలోచనలు ఎంతసేపటికీ ఇందాక తను తెచ్చిన చీరమీదికే మళ్లుతున్నాయి.

నిజంగా తనమీద రాధకేమాత్రం ప్రేమ ఉన్నా ఆ చీరని ఆమె తిరస్కరించగలిగేదా? అన్న ప్రశ్నకి వచ్చే సమాధానం అతని హృదయంలో ఘాటుగా నాటుకొంది.

తనమీద ఆమెకేమీ ప్రేమ లేదని నిర్ధారించుకోటానికి నిదర్శనంగా కొన్ని సంఘటనలు అతనిలో సాక్షుల్లా ప్రత్యక్షమయ్యాయి.

ఒకరోజు ఆరు గంటలదాకా ఆఫీసులో చచ్చేటట్టు పనిచేసొచ్చి తలుపు తట్టాడు. కాని ఎంతసేపటికీ ఆ తలుపు తెరుచుకోబడ లేదు. చివరికి విసుగ్గా కాలితో తంతూ, రాధా, రాధా అని కొంత గట్టిగా పిలిచాడు. పిలిచిన అరగంటకి రాధ రుసరుసలాడుతూ వచ్చి "అబ్బ. ఏమిటండీ. అలా తలుపులు బద్దలగొడతారు. ఈ కొంపలో నాలుక్కాలాలపాటు పడుండాలని లేదా!" అంది. తనూ కొంత కోపంతో "తమ లేవ్వాళ్లు ఏలుతున్నారు." అనడిగాడు. దానికామె మరింత రెచ్చిపోతూ "దొడ్లో పచ్చడి చేస్తున్నాను. అది అయేదాకా ఆగకూడదూ. ఆ కాసేపూ ఆగితే కాళ్ళేమైనా అరిగిపోతాయా" అంది. ఆరు గంటలదాకా ఆఫీసరు రుసరుసలకింద అణగి మణగి చచ్చి చచ్చి ఇంటికొస్తే గడపలో ఆనందంతో ఆహ్వానించకపోగా తలుపులకి గడియ బిగించుకుని దొడ్లో ఎక్కడో పచ్చడిచేస్తూ, పైగా ఏమైనా అంటే కోపమూ. తనకి మండింది. కాని ఎందుకు గోల అని ఆ రోజు సంభాషణ మార్చివేశాడు. అది ఇప్పుడు తలుచుకుంటే - తనకి రూఢిగా తెలుస్తూనే ఉంది తనమీద ఆమెకేమాత్రం ప్రేమ లేదని. ఇంకొక రోజు...

తన మరదలు ఏదో ఊరికి పోతూ దారిలో తమ ఇంట్లో ఒకరోజు ఉండి వెళ్లిపోబోతున్న సమయంలో ఆవిడ కొక్క జాకెట్టు గుడ్డయినా పెట్టకపోతే బాగుండదని తన భార్య అన్నప్పుడే తనదగ్గర గుడ్డి గవ్వ లేకపోయినా ఎరిగున్న వాడి గడపల్లా ఎక్కి దిగి చివరకి ఎక్కడా అప్పు దొరక్క ఇంటికొచ్చాడు. ఆ రోజు తనని రాధ ఎన్ని మాటలందో. ఎక్కడా అప్పు దొరక్కపోతే తనుమాత్రం ఏం చేస్తాడు.

ఆ మర్నాడు తన మరదలు వెళ్ళిపోయింతర్వాత ఎవరో ఓ పది రూపాయలిస్తే భార్యయినా కుట్టించుకుంటుందని జాకెట్టు గుడ్డ తీసుకువచ్చినపుడు దానిని నేలకేసి విసిరికొట్టింది. ఆ గుడ్డ ఇప్పటికీ బీరువాలో పడి మూలుగుతూనే ఉంది.

మరో రోజు...అనవసరంగా ఇంకా పాతవన్నీ తవ్వుకుని బాధపడట మెందుకు! తనమీద ఆవిడకేమీ ప్రేమలేదని స్పష్టంగా తేలిపోతుంటే.

పది రూపాయలు ముప్ఫయి రోజులు రావాలన్నమాటే రాధ హృదయంలో ప్రతిధ్వనిస్తోంది. నిజంగా ఎంత జాగ్రత్తగా వాడుకొన్నా మాత్రం పది రూపాయలు ముప్ఫయి రోజులు వస్తాయా! ఈ చీర తిరిగి ఇచ్చివేస్తే వచ్చే ఆ డబ్బుతో ఎలాగోలా నెల రోజులూ సరిపుచ్చుకోవచ్చు. ఈ మాటే తను తన భర్తతో చెబితే పెడచెవిన పెడతాడేం? తనమీద ఎంతో ప్రేమ ఉండి తెచ్చినవాడు ఈ చీరని తిరిగి ఇచ్చేసి రమ్మంటే ఇచ్చిరాకూడదూ. తన కిష్టంలేని పనిని అత నెందుకు చెయ్యాలి. ఇదేనా తన భర్తకి తనమీద ఉన్న ప్రేమ.

ఒకసారి ఏదో విషయంలో తను "అది కాదండీ" అంటూ భర్తతో తన అభిప్రాయం చెప్పబోతుంటే మధ్యలో అందుకుని "చాల్లే ఇహ ఆపు. నీ బోడి సలహాలెవడిక్కావాలి" అంటూ విసుక్కున్నాడు. అటువంటప్పుడు ఎవరికి కోపం రాదు. అయినా తను ఓర్పు వహించి ఊరుకున్నది కాని ఇంకొకతైతే ఆరోజు అలా ఊరుకోగలిగేదా?

మరోసారి తను ఇంటిపక్కావిడతో మాట్లాడుతూ ఉంటే అతను కాసేపు అటూ ఇటూ తచ్చాడి చివరికి ముఖం ముడుచుకుని ఏమీ పనిలేకపోయినా ఏదో పురమాయించాడు. తనతో మాట్లాడుతుంటే చిరాకు, పోనీ ఇతరులతో మాట్లాడుతుంటే ఆయన కంతకష్ట మెందుకో?

ఇవన్నీ నిజంగా ఆయనకి తనమీద ఏమీ గౌరవం లేదని తెలుపుతూనే ఉన్నాయి. తను ఇంకా ఇక్కడుండి మటుకు చేసేదేమిటి తనపుట్టింటి వారిదగ్గర ఓ పదిరోజులు గడిపి రావచ్చు."

"ఈపూట అన్నం పెట్టదల్చుకో లేదా?"

విచారంగా కూచుని ఆలోచిస్తున్న రాధవంక ఉరుముతూ చూసి అప్పుడే వస్తూ అన్నాడు గోపాలం.

"ఎందుకు పెట్టను?" అంది రాధ.

"మరింకా ఆ ప్రయత్నాలేవీ చెయ్యవేం?"

"మీరప్పుడే లేవరనుకున్నాను."

"ఇప్పుడెంతయిందో తెలుసా?"

"తొమ్మిది."

"రోజూ తొమ్మిదింటికేనా తింటున్నది?"

"అంత ఆకలిగా ఉంటే మీ రడగకూడదూ?"

"ప్రతిరోజూ 'ఆకలిగా ఉంది, అన్నం పెట్టు' అని నే నడుగుతున్నానా, లేకపోతే 'వడ్డిస్తున్నాను లేవండి' అని నువ్వంటున్నావా?"

"పోనీ ఇప్పుడు పెడతాను లేవండి." అంది రాధ కష్టంగా.

రాధ పీట వేసి కంచం పెట్టటానికి వంటింట్లోకి వెళ్లింది. గోపాలం కాళ్లు కడుక్కోటానికి స్నానాలగది వైపు వెళ్లాడు.

రాధ హృదయంలో ఏదో పెద్ద బండ పడ్డట్టుగా వుంది. ఆమె మనసు విరిగిపోయి విచారంగా ఉంది. ఒక పక్క కోపమూ మరో పక్క దుఃఖమూ — ఈ రెంటిలో ఆమె మునిగితేలుతోంది. గోపాలం పలుకులు ఆమె గుండెలో ములుకుల్లా గుచ్చుకున్నాయి.

"ఏమిటి ఇవ్వాళ అన్నంలోకి?"

అతని కంచంలో అన్నం వడ్డిస్తున్న రాధ వెనక గుమ్మందగ్గర తువ్వాలుతో చేతులు తుడుచుకుంటూ అత నడిగిన ప్రశ్నకి ఏవో ఆలోచనలలోనించి ఉలిక్కిపడి 'ఏమిటి' అన్నట్టు చూసింది.

"అన్నంలోకి ఆచింతపండు నీళ్లేనా లేకపోతే ఇంకా ఏమైనా ఉన్నాయా?" కాస్త కోపంగా అన్నాడు గోపాలం.

"చారూ, కూరా."

"అంతేగాని పచ్చడీ, గిచ్చడీ ఏమీ లేదన్నమాట."

రాధకి మండింది. ముఫ్ఫైలూ నలభయ్‌లూ పెట్టి చీరలు తెస్తూ ఇంట్లో అసలే చాలక చస్తుంటే పచ్చళ్లూ, పంచభక్ష్య పరమాన్నాలూ ఎక్కణ్ణుంచి వస్తాయి. అంతగా కావాలనుకున్నవాడు ముప్ఫయి రూపాయలూ తగలేసి చీర తీసుకురాకపోతే ఏ పది రూపాయలో పెట్టి ఓ వంద మామిడికాయలు తెచ్చిపారేస్తే సంవత్సరానికి సరిపోయే ఊరగాయి తినవచ్చునుగా.

మళ్ళీ మాట్లాడితే ఏం తంటానో అని రాధ మెదలకండా ఊరుకుంది.

గోపాలం పీటమీద కూచుంటూ అడిగాడు.

"అదేమిటే?"

"ఏదీ?"

"అదే ఆ నల్లముద్ద."

"కూర."

"ఏమిటీ! అది కూరా!" ఎంతో వింతగా అడిగాడతను.

"అవును. ఏం?" అంది ఆశ్చర్యపోతూ ఆమె.

"ఊహు. ఏదో పురుగు వాలిం దనుకున్నానులే."

"ఇందాక మీతో మాట్లాడుతూంటే కాస్త మాడింది."

"అదసలు మింగుడు పడుతుందీ?"

"పోనీ పారేయండి."

అతను విసుక్కుంటూ అన్నాడు—

"హు. పారేద్దామన్నా అక్కడ తింటానికి మరేమున్నాయి."

రాధ కళ్లు చెమ్మగిల్లాయి. "చారు పొయ్యనా?" అంది మెల్లగా.

"పొయ్యి ఏం చేస్తాం - ఎలాగోలా కడుపు నింపుకోవద్దూ." చారు పోసింది. అతను ఒక ముద్ద నోట్లో పెట్టుకుని— "అబ్బబ్బ. కషాయం" అంటూ తుపుక్కున ఉమ్మేశాడు.

రాధ కళ్లనీళ్లు గిర్రున తిరిగాయి. పమిట చెంగుతో కళ్లు తుడుచుకుంటూ కష్టంగా అంది—

"నే నంటేనే ఇష్టంలేనప్పుడు ఇంక నేను చేసిన వంట ఏం బావుంటుందిలెండి."

ఈ మాటతో అతనికి మరింత విసుగూ, కోపమూ కలిగాయి.

"తొమ్మిది గంటల దాకా మాడినా, మాడిన కూర ఉడకని అన్నంతో నీ చేతి భోజనం తినేకంటే వేళకింత పడేశే ఆ అయ్యరుగాడి అన్నం తినటం నయం."

అది వినేసరికి ఆమెలో ఉన్న ఉక్రోషం వృద్ధిపొందింది. పళ్లు కొరుకుతూ కోపంగా అంది—

"పోనీలెండి నే నంటే ఇష్టం లేనప్పుడు ఇంక నే నిక్కడ ఉండిమటుకు ప్రయోజనమేమిటి. రేపు పొద్దున్నే నేను మా ఊరికి వెళ్లిపోతాను."

అతనూ కోపంతో అన్నాడు—

"పోతేపో నువ్విక్కడ ఉండి ఉద్ధరించే దెవర్ని?"

"ఐతే రేపు రైలెక్కిస్తారు కదూ."

గోపాలం మాట్లాడలేదు.

* * * *

[ఇంకా వుంది]

# ఫిలిం విచారణసంఘ నివేదిక

అక్టోబరు 11 న ఫిలిం విచారణ కమిటీ వారు 12,000 మాటలు గల తమ నివేదికను ప్రకటించారు. జాతీయ ఫిలిం పరిశ్రమను గురించి విచారణ జరపడానికీ, దాని అభివృద్ధికిగాను శిఫార్సులు చెయ్యటానికీ ఎస్. కే. పాటిల్ అధ్యక్షత కింద ప్రభుత్వంవారు ఈ సంఘాన్ని ఏర్పాటు చేశారు. 1949 సెప్టెంబరు లగాయతు ఈ సంఘంవారు విచారణ జరిపారు. వీరు 10 చిత్రనిర్మాణ కేంద్రాలకు పోయి 339 మంది వ్యక్తులతో మాట్లాడారు. 288 మంది వ్యక్తులనుండీ, సినిమా సంస్థలనుండీ ప్రశ్నావళికి జవాబులు తెప్పించారు. సినిమాకూ ప్రజలకూ గల సంబంధాన్ని గురించి సినిమా పరిశ్రమకు సంబంధంలేని వారు 225 మంది నుండి మరొక ప్రశ్నావళికి సమాధానాలు తెప్పించారు. ఇది కాక ఫిలింవిచారణ సంఘాధ్యక్షుడు 1950 లో ప్రపంచ పర్యటనచేసి అమెరికా, బ్రిటన్, పశ్చిమ యూరప్, తూర్పు ఆసియా దేశాలలోని ఫిలిం పరిశ్రమలను గురించి తెలుసుకొని వచ్చాడు.

ఫిలిం విచారణ సంఘంలో శ్రీమోటూరి సత్యనారాయణ, వి. శాంతారాం, బి. ఎన్. సర్కార్, డాక్టరు త్రిపాఠి, వి. శంకర్ మొదలైనవారున్నారు.

## ప్రస్తుత పరిస్థితి

ఈ విచారణలో తేలినవిషయాలేవంటే:

దేశంలో 3,250 సినిమాలున్నాయి; 60 స్టూడియోలున్నాయి; ఏటా సుమారు 275 చిత్రాలు తయారవుతున్నాయి; సినిమా పరిశ్రమలో 32 కోట్లరూపాయలు శాశ్వతపెట్టుబడి జరిగి ఉంది; ఇది కాక 9 కోట్లు తిరుగుతున్నది; సినిమా పరిశ్రమకు ఏటా 20 కోట్ల రాబడివున్నది; ఏడాదికి 60 కోట్లమంది భారతీయులు సినిమా చిత్రాలు చూస్తున్నారు.

భారతీయ చిత్రాలు పాకిస్తాన్, మలయా, ఇండో చైనా, సయాం, బర్మా, తూర్పు ఆఫ్రికా, దక్షిణాఫ్రికా, సింహళాలలో చలామణీ అవుతూ దేశానికి విదేశీ ద్రవ్యాన్ని చేకూర్చుతున్నాయి.

దేశీయ చిత్రనిర్మాతలలో పోటీ హెచ్చుగా ఉండటం మూలాన చిత్రాల నాణ్యం, రాబడీ బాగా లేక ఇప్పుడు వచ్చేరాబడి 200 చిత్రాలకు సరిపోయేదిగా ఉన్నది.

## శిఫార్సులు

ఫిలిం విచారణ సంఘంవారు ఈ కింది శిఫార్సులు చేశారు:

### 1. ఫిలిం కౌన్సిల్:

ఇండియా ప్రభుత్వం చట్టరీత్యా ఒక ఫిలిం కౌన్సిల్ ఏర్పాటుచేయాలి. అది స్వతంత్రంగా వ్యవహరిస్తూ, ఒకవంక ఫిలిం పరిశ్రమను క్రమమార్గాన నడుపుతూ, రెండోవంక ఫిలిం వ్యవహారాలలో కేంద్ర రాష్ట్రప్రభుత్వాలకు సలహా ఇస్తుంది. సినిమా చిత్రాలు మంచి ప్రమాణాలు కలిగి ఉండి, సంస్కృతిని పెంపొందిస్తూ, ఉత్తమ తరగతివినోదాన్ని ఇచ్చేవిగా ఉండేలాగు చూస్తుంది. చిత్రనిర్మాణానికి చెందిన వివిధ విషయాలనూ, పరిశోధనలనూ, ముడిఫిలిం ఉత్పత్తినీ గురించి ఆలోచించటానికి వేర్వేరు ఉపసంఘాలను నియోగిస్తుంది. ఫిలిం పరిశ్రమయొక్క వివిధ శాఖల మధ్య కలిగే తగాదాలను పరిష్కరిస్తుంది. ఇందులో 18 మంది సభ్యులుంటారు. వారిలో ప్రొడ్యూసర్లూ, డైరెక్టర్లూ, ఎగ్జిబిటర్లూ, నటులూ, టెక్నీషియనులూ, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వ నియోజి



“లేడీ విత్ ఎ లాంప్” అనే బ్రిటిష్ చిత్రంలో ఫ్లారెన్స్ నైటింగేల్ పాత్రధరించిన అనా నీగిల్

తులూ, కార్మిక ప్రతినిధులూ ఉంటారు. ఉన్నత/న్యాయశాస్త్రానుభవం గల వ్యక్తిని కేంద్రప్రభుత్వం ఈ కౌన్సిలుకు అధ్యక్షుడుగా నియమిస్తుంది.

దేశంలోకి దిగుమతి అయే ముడి ఫిలింమీదా, దేశంలో తయారయే ముడి ఫిలింమీదా, దిగుమతి అయే విదేశీ చిత్రాలమీదా పన్ను వేసీ, సినిమాలమీద వసూలయే వినోదపన్నులు పదో వంతు పైదానికి కలిపీ ఒక నిధి ఏర్పాటుచేస్తారు. ఈ డబ్బుతో ఫిలిం కౌన్సిల్ పరిశోధనలు సాగిస్తుంది; సినిమా నటులనూ టెక్నీషియనులనూ తయారుచేసే సంస్థలు నడుపుతుంది. ఏటా ఉత్తమ (సినిమా) కథకూ, ఉత్తమ డైరక్టరుకూ, ఉత్తమ సమీక్షకూ, ఉత్తమ చిత్రానికీ బహుమతు లిస్తుంది. బాలల చిత్రాలూ, విద్యా చిత్రాలూ ప్రోత్సహించటానికి ప్రత్యేకంగా ఒక ఉపసంఘం ఏర్పాటవుతుంది.

## 2. ప్రొడక్షన్ కోడ్ శాఖ :

ఫిలిం కౌన్సిల్ ఆధ్వర్యాన కొంతమంది నిపుణులతో ప్రొడక్షన్ కోడ్ శాఖ ఒకటి ఏర్పాటవుతుంది. ఈ నిపుణులు ప్రతి సినిమా స్క్రిప్టునూ పరిశీలించి, చిత్ర నిర్మాణాన్ని క్రమమార్గంలో నడుపుతారు. ఇతర దేశాలకు ఎగుమతి అయే చిత్రాలను ఈ శాఖ ఆమోదించవలసి ఉంటుంది. ఈ శాఖ తాలూకు కార్యాలయాలు ఢిల్లీ, మద్రాసు, కలకత్తా, బొంబాయి నగరాలలో ఉండి ఆరంభంలో ప్రభుత్వంచేత నడపబడతాయి.

## 3. ఫిలిం ఫినాన్స్ కార్పొరేషన్ :

ఫిలిములకు పెట్టుబడి సహాయం చెయ్యటానికిగాను కోటిరూపాయల మూలధనంతో ఒక సంస్థ ఏర్పడుతుంది. ఈ మొత్తం ప్రభుత్వమూ, పరిశ్రమా, ప్రజలూ సమకూరుస్తారు. రిజర్వు బాంకు అనుమతితో ఈ సంస్థ మరొక కోటి రూపాయలు అప్పు చేయవచ్చు.

## 4. పన్నుల తగ్గింపు :

సినిమాలపై వినోదపు పన్ను అన్ని తరగతుల టిక్కెట్లపైనా అయిదో వంతు మాత్రమే ఉండటం అత్యవసరం. సినిమాకు సంబంధించిన లైసెన్స్ ఫీజు సవరించాలి. ఏటా 24 కోట్ల అడుగులు మించని రా ఫిలిం లైసెన్సు నిర్బంధాలు లేకుండా దిగుమతి అయి, ఫిలిం సంస్థలద్వారా పంపకం కావాలి. ఏటా 45 లక్షలరూపాయల సినిమా పరికరాలూ, ప్రొజెక్టర్లూ వగైరా దిగుమతి కావాలి. సాధ్యమైనంతవరకు ముడి ఫిలిం, యంత్రసామగ్రి ఈ దేశంలో తయారు కావటానికి ప్రోత్సాహం లభించాలి.

ఇంకా సినిమా చిత్రాల ఎగుమతి గురించి, చిన్న ఫిలిముల నిర్మాణం గురించీ ఫిలిం విచారణ సంఘంవారు శిఫార్సులు చేసి ఉన్నారు.

### లక్ష్మీకాంత ప్రొడక్షన్స్

లక్ష్మీకాంత ప్రొడక్షన్స్‌వారు 7-10-51 న బెజవాడ గాంధీనగరంలో బ్రాంచి ఆఫీసు ఏర్పాటుచేశారు. కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు లక్ష్మీపూజచేశారు. టి. గోపీచంద్, ఎస్. రాజేశ్వరరావు మొదలైన సినిమా పెద్దలు ఈ ప్రారంభోత్సవంలో పాల్గొన్నారు. వీరు తీయనున్న సాంఘిక చిత్రం "పెద్ద కోడలు." రచన : సురటి. ★



భారతలక్ష్మీప్రొడక్షన్సువారి "ప్రియురాలు"లో కనకం, కొండయ్యాకలిసి రేలంగిని ఖుషామత్ చేస్తున్నారు.

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(7-వ పేజీ తరువాయి)

కాని శత్రువులే ఈ పని చేసి ఉంటే కనిపెట్టడం మీకే మంచిది"

విల్‌ఫర్ట్ తడబడుతూ ఇలా అన్నాడు. "కావచ్చును. నా పాతికేళ్ల ఉద్యోగకాలంలోనూ అనేకమంది నాకు శత్రువులుగా మారారు. ఇంక ఈ రహస్యాన్ని కప్పిపుచ్చడం మంచిది. డాక్టర్ మిమ్మల్ని ప్రార్థిస్తూన్నాను. ఇది పైకిపొక్కినట్లయితే నాశత్రువులకు విజయం ప్రాప్తించినట్లే. నేను నా పదవికి నీళ్లు విడిచిపెట్టవలసిందే.

"విల్‌ఫర్ట్! నేను నా విధ్యుక్తధర్మం నెరవేర్చాను. మీ అత్తగారు మరణించింది. ఆమెను కాపాడలేకపోయాను. కాని ఇది మరిచిపోకండి. జాగ్రత్తగా కనిపెట్టిఉండండి. మీరు న్యాయాధికారులు. మీకు నేనధికంగా చెప్పవలసిన పనిలేదు."

విల్‌ఫర్ట్ దీర్ఘనిశ్వాసం విడిచి లేచాడు. "నాకిప్పటికి ముప్పు గడిచినట్లే. కాని పాపం వాలంటిన్! ఆమె ఎలా భరిస్తుంది?" ఇద్దరూ మెల్లిగా ఇంటిలోకి వెళ్లిపోయారు.

మారెల్‌కి ముచ్చెమటలూ పోశాయి. మేడ వంక చూశాడు. మూడు కిటికీలలోనుండి వెలుగు నిశ్చలంగా వస్తోంది. ఎవరో అక్కడ వెక్కి వెక్కి ఏడుస్తున్నట్లు, ఏడ్పును అణుచుకోడానికి ప్రయత్నిస్తున్నట్లు తోచింది.

కొంతసేపటికి ఒక కిటికీలో నీడ ఏదో కనపడింది. ఆనీడ సరిగ్గా మారెల్ ఉన్న వంకకే చెయ్యిచాపి రమ్మని పిలుస్తున్నట్లు మారెల్ భ్రమించాడు. వాలంటిన్ తనను చూసిందని ఊహించుకున్నాడు. మెల్లిగా చెట్టుదిగాడు. చెట్ల వరుసలు దాటి పడమటి వైపు వెనక ద్వారంవద్దకు చేరాడు. చేతితో గెంటగానే తలుపు తెరుచుకుంది. తివాసీలు పరిచిన మెట్లపై చప్పుడు కాకుండా పైకెక్కి మేడమీద వరండాలోకి చూశాడు. అక్కడెవరూ లేరు.

వాలంటిన్ అనేక సార్లు తన ఇంటిని గురించీ, నయర్‌టైర్ నివాసం గురించీ మారెల్‌కి చెప్పింది. అది జ్ఞప్తిలో ఉంచుకుని మారెల్ ముందుకడుగువేశాడు. ఒకచోట గదిలోనుంచి మూలుగు వంటి సన్నని ఏడ్పు వినవచ్చింది. మెల్లిగా తలుపు తోశాడు. వెలుగు ప్రసరించింది. గదిలో ఒక చివర పడకపై శవం ఉంది. వాలంటిన్ పక్కనే కూర్చుని పడకలో ముఖం దాచుకుని విలపిస్తోంది. మెల్లిగా పిలిచాడు. వాలంటిన్ మెల్లిగా లేచి కన్నులు తుడుచుకుని చూసింది. "ఎవరు? నువ్వా? ఈ వేళప్పుడిక్కడికెలా వచ్చావు?"

"వాలంటిన్! ఎనిమిది గంటలనుంచి నీకోసం వేచి ఉన్నాను. నువ్వు పదిగంటలైనా రాలేదు. గోడదూకి తోటలోకి వచ్చాను. అక్కడ ఎవరో కనపడిగానే చెట్టెక్కాను. వచ్చిన ఇద్దరూ మాట్లాడినదంతా విన్నాను. ఆమె చనిపోయిందని చెప్పుకున్నారు...."

"కాని నువ్విలా వచ్చినట్లు బయటపడితే మన ఆశలన్నీ భగ్నమైపోవా?"

"నన్ను క్షమించు. నేను వెళ్ళిపోతాను."

"కాదు, ఆగు. నాతో రా."

"ఫ్రాంజ్ ఏమైనాడు? వచ్చాడా?"

"వచ్చాడు—కాని వచ్చిన సమయానికి మా అమ్మమ్మ మరణయాతన పడుతోంది."

"పాపం!" అన్నాడు మారెల్. కాని అతనిలో స్వార్థం ఇదంతా మంచికే వచ్చిందని తోపించకపోలేదు.

"కాని ఇప్పుడు మరొక పెద్దచిక్కు వచ్చింది మారెల్. ఆమె చనిపోతూ ఫ్రాంజ్‌తో మాట్లాడింది. వెంటనే పెళ్ళి జరిగిపోవాలని చెప్పింది. నా తండ్రి మాట ఇచ్చారు కూడా."

"ఆగు. ఎవరో వస్తున్నారు."

"ఫరవాలేదు. ఈ దారిని రా. ఇక్కడే తాతగారి గది."

"అక్కడికా?"

"అవును. ఫరవాలేదు. మన సంగతి ఆయనతో చెప్పాలనీ, నిన్ను ఆయనకు పరిచయం చెయ్యాలనీ చాల రోజులుగా అనుకుంటున్నాను మారెల్. ఇంక మనకీ ప్రపంచంలో ఆయనొక్కడే మిత్రుడు మిగిలాడు."

ఇద్దరూ వరండాలో చివరివరకూ నడిచివెళ్లి, అక్కడ గది తలుపు తట్టారు. పరిచారకుడు బారోయ్ తలుపు తీశాడు. "బారోయ్, తలుపులు మూసి గడియ వెయ్యి. ఎవ్వరినీ లోపలికి రానియ్యకు"అని చెప్పింది వాలంటిన్. గది ప్రవేశించాక ముందుగా ఆమె వృద్ధుని సమీపించింది. "తాతా! అమ్మమ్మ కూడా చనిపోయింది. ఇంక నువ్వు తప్ప నా కీలోకంలో ఎవరూ లేరు." అంటూ మోకరిల్లి ఆమె వృద్ధుని ఒడిలో తలదాచుకుంది. వృద్ధుడు కరుణతో చూశాడు. మెల్లిగా శిరసెత్తి ఆమె మాక్సిమిలియన్ వంక చూసింది. అతని చెయ్యి పట్టుకుని "ఇదిగో! ఇతన్ని చూడు తాతా! అంది. ఇతని పేరు మాక్సిమిలియన్ మారెల్. ఇతని తండ్రి ఓడల యజమాని నీకు గుర్తేనా?"

అవునన్నట్లు వృద్ధుడు చూశాడు.

"నేనితన్నే ప్రేమించాను. ఇతన్ని తప్ప ఇంకెవరినీ పెళ్లి చేసుకోను. అలా సమకూడకపోతే నేను నా చేతులతో నా ప్రాణాలు తీసుకునేమాట నిజం."

వృద్ధుడు కొంతసేపు మారెల్ ముఖంవంక ఏకాగ్రతతో చూశాడు. కలవరపడుతూన్నట్లు అతని కన్నులే చెప్తున్నాయి.

"నా తండ్రి పన్నాగం నించి మమ్మల్ని కాపాడవా తాతా?"

నయర్‌టైర్ మళ్ళీ మారెల్ వంక చూశాడు. అతని చూపులో అర్థాంగీకారం ద్యోతకమయింది. మారెల్ అది గ్రహించి "వాలంటిన్ నువ్వు మీ అమ్మమ్మగారివద్దకు వెళ్లు. నే నీయనతో కొద్దిసేపు మాట్లాడాలి" అన్నాడు.

వాలంటిన్ లేచి మెల్లిగా వెళ్ళిపోయింది. తిరిగి గది తలుపులు బంధించబడినాయి.

ఇదివరలో ఈ వృద్ధునిగురించి వాలంటిన్ మారెల్‌కి చెప్పింది. అదంతా గుర్తుకు తెచ్చుకుని మారెల్ ప్రక్కనే ఉన్న నిఘంటువు, కలం కాగితం తెచ్చి దగ్గర పెట్టుకున్నాడు. వృద్ధుని గురించి వాలంటిన్ తనకు చెప్పినదంతా మారెల్ నివేదించాడు. తన ప్రేమనుగురించి నివేదించాడు.

"మీకు సర్వం తెలిపాను. నా ఆశలన్నీ వాలంటిన్‌పైనే ఉన్నాయి. మీ అభిప్రాయం తెలుపుతారా?" అన్నాడు మారెల్.

వృద్ధుడు అంగీకారం తెలిపాడు.

"వాలంటిన్‌ని నా సోదరివద్దకు తీసుకుపోయి, పెళ్లిచేసుకుని దేశాంతరం వెళ్లిపోవాలని నిశ్చయించుకున్నాను. ఆమెకూడా అంగీకరించింది. ఇది మీకు సమ్మతమేనా?"

కాదన్నట్లు నయర్‌టైర్ సూచించాడు.

"అయితే మరొక మార్గం ఉంది. నేను ఫ్రాంజ్‌తో సర్వం చెప్పి ఈ పెళ్లి విరమించుకోవలసిందని ప్రార్థిస్తాను. సహృదయుడైతే అతి నంగీకరిస్తాడు. లేదా అతనితో ద్వంద్వయుద్ధం చేస్తాను. ఇద్దరిలో ఎవరో ఒకరం చనిపోవడం సంభవిస్తుంది. అతను చనిపోతే, వాలంటిన్‌ని నేను వివాహం చేసుకుంటాను. నేనే చనిపోతే, వాలంటిన్ అతన్ని వివాహం చేసుకోదు."

అలా వద్దని వృద్ధుడు సూచించాడు.

"అయితే ఇంక ఏం చెయ్యమంటారు? వృద్ధురాలు వెంటనే

 

వివాహం జరిపించాలని కడసారి కోరిక వెల్లడించింది. అది జరుగుతోంటే చూస్తూ ఊరుకోనా?"

నయర్ టైర్ ఈమారు కన్నులు మూసుకున్నాడు.

"అయితే ఫరవా లేదని మీరు చెప్పగలరా?"

అవునన్నట్లు మాశాగు వృద్ధుడు.

"కాని జాప్యమైనకొద్ది మా ఆశలు భగ్నమైపోతాయని భీతి బాధిస్తోంది నన్ను."

ఫరవా లేదన్నట్లు చూశాడు వృద్ధుడు.

"మీరు కాపాడగలరా?"

అవునన్నట్లు చూశాడు వృద్ధుడు. ఈ మారతని చూపులో దృఢ విశ్వాసం పొడగట్టింది.

"అయితే కొన్ని రోజులు నిరీక్షించనా?"

"అవును."

"కంట్రాక్టు పై సంతకాలు జరగవుకదా? మీరు అలా నమ్మకంగా చెప్పగలరా?"

వృద్ధుడు సమ్మతి చూపాడు.

"అయితే ఇంక నేను వెళ్లవచ్చునా?"

వృద్ధుడు అంగీకారం సూచించాడు.

మారెల్ వృద్ధునికి అభివాదం చేసి వెళ్లిపోయాడు. ప్రాకారమెక్కి నిచ్చెనసహాయంతో అవలిప్రక్కకు దిగి ఇంటికి వెళ్లి మారెల్ నిశ్చింతగా నిద్రపోయాడు. ★

# అరబ్ దేశాలలో సంచలనం

(3-వ పేజీ తరువాయి)

టులో ప్రధానినహాస్ పాషా ప్రవేశపెట్టాడు.

1936 ఆంగ్లో - ఈజిప్షియన్ ఒడంబడికను సవరణచెయ్యాలని ఆరేళ్లుగా బ్రిటిష్, ఈజిప్షియన్ ప్రభుత్వాలు రాయబారాలు జరుపుతున్నా, సూడాన్ భవిష్యత్తు గురించి సమాధానం కుదరనందువల్ల రాజీ కుదర లేదు. సూయజ్ కాలువ ప్రాంతరక్షణ నిమిత్తం బ్రిటిష్‌వారు పది వేల సైనికులను నిలవరించడానికి 1936 ఒడంబడికలో జరిగిన ఏర్పాటును సవరణ చెయ్యడానికి బ్రిటన్ సమ్మతి చూపిన మాట నిజమే. కాని ఆ ప్రాంతరక్షణకు మరొక ఏర్పాటు జరిగే వరకూ అట్టి సవరణ జరగరాదని వారి అభిప్రాయం. అట్టి ఏర్పాటుకోసమే బ్రిటన్ అమెరికా, టర్కీ ప్రభుత్వాలు సమష్టి రక్షణకు కొన్ని సూచనలు చేస్తూ, ఈ ఏర్పాటులో సమాన ప్రతిపత్తితో చేరవలసిందని ఈజిప్టుప్రభుత్వాన్ని ఆహ్వానించాయి. కాని సూడాన్ పై ఈజిప్టు రాజరికస్వత్వాన్ని ఆమోదించనిదే, నైలునదీలోయ ప్రాంతాన్ని అంతటినీ ఈజిప్టు రాజుపాలన కిందికి తీసుకురానిదే ఎట్టి ఏర్పాట్లనూ ఈజిప్టు ప్రభుత్వం అంగీకరించబోదని స్పష్టపడుతోంది.

అయితే పర్షియాలో రష్యా జోక్యం వల్ల ప్రపంచయుద్ధం ప్రజ్వలించగలదనే భయంతో బలప్రయోగం చెయ్యడానికి జరిగిన బ్రిటిష్ ప్రభుత్వం, అట్టి భయానికి అవకాశంలేని ఈజిప్టు విషయంలో బలప్రయోగానికి వనుదియ్యదనిస్పష్టపరిచింది. అందువల్ల నహాస్ పాషా ప్రభుత్వమో, బ్రిటిష్ ప్రభుత్వమో పరిస్థితులకు తలొగ్గి లొంగకపోతే, ఈ సమస్య శాంతియుతంగా పరిష్కారమయ్యే అవకాశం కనపడదు. ★

# ★ జంతువులు - పక్షులు ★

## తెల్ల నెమలి

మామూలు నెమలి అంత అందంగా ఉండదు గాని ఇదికూడా అందమైన పక్షిగానే లెక్కకొస్తుంది. అంతా తెల్లగానే వుంటుంది. మామూలు నెమలి వలెనే ఇదికూడా సంతోషంగా ఉన్నప్పుడు, ముఖ్యంగా మబ్బులు పట్టి ఉరుముతున్న సమయాల్లో నృత్యం ప్రారంభిస్తుంది. అంటే నిజంగా ఏ భరతనాట్యమో చేస్తుందని కాదు. దాని నడక చూస్తే అతిశయం, ఆభిజాత్యం కనిపిస్తుంది. తన అందం ప్రదర్శించడానికే అన్నట్టుగా, తల ముందుకూ వెనక్కూ ఆడించుకుంటూ, రొమ్ము విరుచుకుని గర్వంగా నడుస్తుంది. ఈ నడకనే మన కవులు నాట్యంగా వర్ణిస్తారు. దీని అరుపును క్రేంకారం అంటారు. అంత అందంగా ఉండే పక్షి అంత కఠోరంగా ఎల్లా అరుస్తుందా అని ఆశ్చర్యం వేస్తుంది. ఇది 11 నుండి 20 ఏళ్ళవరకూ జీవించగలదు.


తెల్ల నెమలి



## మొసలి

ఇవి సాధారణంగా పెద్ద నదుల్లోను, పెద్ద పెద్ద చెరువుల్లోను, మడుగుల్లోను నివసిస్తాయి. ఉష్ణమండలాల్లోనే ఇవి కనిపిస్తాయి. దీనికి పొడుగాటి బలమైన తోక వున్నది. దాన్ని ఎటుపడితే అటు అవలీలగా, అతివేగంగా తిప్పగలదు. నీళ్లు తాగటానికి వచ్చే జంతువులను గాని, మనుష్యులనుగాని పక్కవాటుగా బలంగా కొట్టి, ఒక్క దెబ్బతోనే పడవేస్తుంది. ఎలుగుబంటి, పెద్దపులి మొదలైన పెద్ద జంతువులనుకూడా ఇది దెబ్బకు చంపివెయ్యగలదు. ఒకసారి దీనినోట్లో చిక్కిన జంతువు ఎంత బలమైనదైనాసరే విడిపించుకోలేదు. సరీసృపాల జాతికి చెందిన ఇది నదుల ఒడ్డున ఇసుకలో ఒక్కోసారికి రమారమి 20 దాకా గుడ్లు పెడుతుంది. సూర్యరశ్మికి గుడ్లు పగిలి పిల్లలు బయటికి వస్తాయి. వెంటనే నీటిలోకి పారిపోతాయి. చెన్నపట్నం 'జూ'లోని మొసళ్లు విప


మొసళ్లు

శీతంగా వృద్ధి అవుతూండటం మూలాన అడపా దడపా వాటిని చంపెయ్యవలసి వస్తున్నది. గంగా నదిలోని మొసళ్లు కొన్ని 25 నుండి 35 అడుగులదాకా పొడుగు పెరుగుతాయి. ఇవి ఎక్కువగా చేపల్ని తినే జీవిస్తాయి. సాధారణంగా మనుషుల జోలికి రావు. కాని ఉప్పు నీళ్లల్లోను, ఆఫ్రికాలోని నైలు నదిలోను ఉండే మొసళ్ళు మహా భయంకరమైనవి. ఇవి మనుషుల్ని ఎక్కువగా గుటకాయస్వాహా చేస్తూంటాయి. వీటి జీవితపరిమితి 15 నుండి 35 ఏళ్ళు.



పెద్దపులి

## పునుగుపిల్లి

ఈ జంతువు భారతదేశం, బర్మా, సింహళం, మలయాలలో అంతటా కనిపిస్తుంది. ఆఫ్రికా ఖండంలో కనిపించే వాటికి వంటి నిండా బొచ్చు వుంటుంది. పగటి పూట తెగ నిద్రపోతాయి. రాత్రి అవుతున్నకొద్దీ ఉషారెక్కువవుతుంది. ఇక తిండివేళప్పుడు వీటి ఆరాటం చెప్పనలవికాదు. వీటికి చెట్లెక్కడం చేతకాదుగాని, బాగా ఈదగలవు. ఈ జంతువులోని ముఖ్య విశేషమేమంటే దీని శరీరంలో వెనకభాగాన పునుగు అనే పసుపుపచ్చని పదార్థం తయారవుతుంది. అది మెత్తగా జిడ్డుగా వుంటుంది. పునుగువాసన కస్తూరి మోస్తరే మహా ఘాటుగా ఉంటుంది. దానినితీసి శుభ్రపరచి సువాసన ద్రవ్యాల్లోకలపటానికి కొన్ని మందుల్లోకి ఉపయోగిస్తారు.



పునుగుపిల్లి

## పెద్దపులి

పెద్దపులులు ఆసియాలోనే కనిపిస్తాయి. భారతదేశం, బర్మా, సుమత్రా, జావాలలో విరివిగా కనిపిస్తాయి. సింహళద్వీపంలో మాత్రం మచ్చుకైనా కనిపించవు.

ఇవి కీకారణ్యాల్లో ఎక్కువగా నివసిస్తాయి. పగలల్లా పొదల్లోను, గుహాల్లోను దాక్కొని నిద్రపోతాయి. సూర్యాస్తమయం కాగానే "ఆకలియాత్ర" లకి బయలుదేరతాయి. ఒక్కోసారి ఏ జంతువూ దొరక్కపోతే మైళ్లకి మైళ్లు ప్రయాణం చేస్తాయి. లేళ్లు, అడవిపందులు, ఆవులు, గొర్రెలు వీటికి ఇష్టమైన ఆహారం. మామూలుగా మనిషిని చూస్తే పెద్దపులి పారిపోతుంది, కాని మంచిఆకలిమీదవున్నపుడు మనిషిని ఎదుర్కొని చంపటానికి వెనుదీయదు. ఒకసారి మనిషి మాంసం రుచి మరిగితే ఇక వదలదు. పెద్దపులుల స్వభావాలు, అలవాట్లు

(48-వ పేజీ చూడండి)

# మారు మనువులు

(9-వ పేజీ తరువాయి)

గంగులు రుసరుసలాడుతూ మసులుతోంది. ఏం మాటాడకుండా పోతురాజు కూసు కడుపునింపుతున్నాడు. "ఎక్కడికెళ్లిందో సూత్తాంగా."

చెయ్యి కడిగేసుకుని చుట్ట జాగర్తగా వెలిగించాడు. బుసబుస పొగవదుల్తా కమ్మని వాసని అనుభవిస్తున్నాడు. గంగులు గిన్నె ముందెట్టుకొని కూడు కుడుస్తోంది.

ఆకాశంలో చంద్రుడు వెన్నెల భోజనం పెడుతున్నాడు గెవతలికి.

గంగు ఇవతలికొచ్చి చెయ్యి కడుక్కుంది. పోతురాజు తండ్రితో బాతాఖానీ కొడుతున్నాడు. మాటలు పూర్తయ్యే సరికి తొమ్మిదగంటల, పదిగంటల రాతిరి కావచ్చు.

చంద్రుడు చల్లని వెన్నెలలో కాముకులను గిలిగింతలు పెడుతున్నాడు.

"గంగూ"

"..."నిశ్శబ్దం.

మళ్ళ పిలిచేడు.

గంగులు కళ్లు మిటకరిస్తూ దేన్ని గురించో ఆలోచిస్తోంది.

పోతురాజు మళ్ళీ కేక లేసేడు.

"గంగులూ !"

"ఏంటి ఊరికే కేకలు" విసుక్కుంది.

"ఇలారా ఇక్కడడుకో సల్లని యెన్నెల్లో" తనపక్క మాపెట్టేడు.

గంగులు రాయిలాగ కదల్లేదు.

"నిన్నే పడుకోమంట. నా పక్కలో అడుకో"

"ఏటి అత్తమానూ"

"..............."

"నాకొంట్లో బాగా నేదు. ఏంసెయ్యమంటవ్."

"రోజూ ఇదోయేసం నాగుంది. రోజూ బాగా నేదేటి ! ఇయాల్టికే"

"నేను రానంటే రా నేను"

"బలమంతం సేయించుకోకు. నీ సంగతి నాకు తెలవదనుకున్నావా బోసిడిక్క"

పోతురాజు కోపంతో వళ్లు మీదా తెలీకుండా గంగులుమీద పడ్డాడు. గంగులు విదళించుకోబోయింది.

పోతురాజు గంగుల్ని మూలకు విసిరికొట్టి గిజాయించి, తోసేసేడు. రయిమని పక్కమీదికి పోయి తగ్గని నిశ్వాసంతో ఊర్పు లెగబోస్తూ కళ్లుమూసుకున్నాడు.

మూలపడిపోయిన గంగులు తేరుకుంది. మెల్లిగా పాములా కదిలింది. నెమ్మదిగా వంటింటోకి పాకిపోయింది. ప్రశాంతంగా పోతురాజుకి నిద్రపట్టలేదు. తీవరమైన కలలు ఆ శ్రామిక జీవిని నూతన ప్రపంచంలోకి లాక్కుపోయినై. ఏదో సంఘర్షణాయత్తమైన స్వాప్నిక జగత్తు అతని మనసుకి (నిదురించినా) పని చెప్పింది.

## 3

తెల్లవారేటప్పటికి, మొండి చీపరి చప్పుళ్లు వినిపించలేదు. ఇల్లూడ్పుల సందళ్లు పోతురాజుని, దురగణ్ణి మేలుకొల్పలేదు. జానపదుల పాట రాగాలు తీసుకుంటూ పాడేది నేడు వారిద్దరి చెవుల్లో దూరబడలేదు.

రోజూ తన ముఖంమీది ముసుగు ఊడలాగే గంగులు ఇవాళ ఆ పనికి రాలేదు. పోతురాజు వళ్లు విరుచుకుంటూ లేచేడు.

"గంగూ" నిద్రమత్తులో నేకేక పెట్టేడు. గంగు లక్కడికి రాలేదు సరిగదా పలుకైనా లేదు. ఇంతెందుకు? గంగులు ఆయింట్లోంచి అర్ధరాత్రి అర్ధరాత్రి పారిపోయిందంటే ఏ గొడవాలేదు. తను చేసుకున్న మొగుణ్ణి వదిలేసి, లేచిపోయింది.

"ఆడూ ఇదీ పానేసుకుంటారు. లేక పోతే అద్దరేతిరి దీని కెన్నిగుండెలుంటై ఎగ్గాయించడానిక్కి" పోతురాజు కేక లేసేడు. దురగడికి కోడలు ఎగదొబ్బడంతోనే, మనసు చివచివలాడింది.

"ఎంత ఖిల్లాడీ సేసిందో సూసేవురా! రాడీ ఎవిడీరండ"

"ఉత్తినే పోయిందేటి ?"

పోతురాజు డబ్బు దాచుకొనే గూటిలో ముంత చూసేడు. గుండెలు గుభేల్ మన్నట్టు చిల్లిగవ్వయినా లేదు. అందులో, చిల్లర మల్లర కానీ దమ్మిడీ కలుపుకొని, పాతిక, ముప్పై రూపాయలుంటాయని పోతురాజు అంచనా.

గూడెంలో వాళ్ళందరూ, ముక్కులు మీద వేలేసుకున్నారు. ఎంతకైనా తెగించి పోయిందిరా ఆడది! పోతురాజు తన గుండెని ఎవరో దొంగిలించినట్టు మసలసాగాడు. రెండుమూడు రోజులువరకు అతనికి కూలిపనికి పోడానికి తెమలనే లేదు. విచారంతో మెదడంతా కదిలిపోయింది.

పిచ్చివాడిలా వెంగటిల్లిపోయేడు లేచిపోయిన దానిమీద.

"రెండొందలెట్టి పెళ్లిసేసుకున్నాకా, రెండేళ్ళన్నా కాపరం ఎలగబెట్టకుండా నే ఎగేసిందే! ఇల్లా సేత్తదని కల్లోఅన్నానుకోనేదే! నేనెందుగ్గిట్టనేదో దీని సొగచుకి. రాతిరి తన్నడం మూనాన్నె ఈ సికొచ్చింది. ఆ డెవడో యెదవనాయాల ఎత్తుకుపోయేడు"

వాడనేటప్పటికి, పోతురాజు కాలు గాలిన పిల్లిలా గెంతేసేడు. "ఎవ్రడా ఆడు నా పెళ్లాన్ని లేవగొట్టుకెళ్లినోడు? ముక్కలు ఇరగ్గొట్టి డొక్క సీల్చి డోలుగట్టి, ఆడు సేసిన గొప్పదనం గోలెట్టి డోలువాయిత్తా. డోలువాయిత్తా" పోతురాజు పౌరుషంతో మీసాలు రోసాలు, మెలికలు తిరిగిపోయినై.

మళ్లీ గంగులు మనసులో నిలబడింది. "ఛీ లేచిపోయింది యెదవనంజ! ఛీ! ఛీ! ఎంగిలికూడు! లేసిపోయిందాన్ని మళ్ళీ ఏలుకోడం పిచ్చోడిపని. మారుమనువు సేసుకుంటే!"

పోతురాజు గంగు స్వరూపాన్ని మనసులోంచి తొలగించుకోలేకపోతున్నాడు. ఆ నవనవలాడే యౌవనపు పొంకం, ఒొమ్ముల బింకం, అతన్ని మాటిమాటికి కలవరపరుస్తున్నాయి. మళ్ళీ అలాంటిది దొరుకుద్దా? ఆ జిలిబిలి, ముద్దుగా మూర్తీభవించిన పెదవుల జంట పోతురాజు కళ్లలో ప్రతిఫలిస్తోంది.

ఎలాగైనా తిరిగి తెచ్చుకుంటేనో? తన వస్తువు మఱొకడి చేతిలో నలిగిపోతుంటే ఎలాగుంటుంది వెంటనే లాక్కోవాలని బుద్ధిపుడుతుంది.

తప్పేంలేదు! ఏదో అలిగిపోయుంటది. తన కాళ్ళు 'పెద్దారం' జోరుజోరుగా లాక్కుపోయాయి. "ఎళితే ఎళ్లేను గాను గాన్ని గురించి ఏం వొకబు సేయకూడదు."

ఇతనికి తెలీకుండా నోరు వాకబు సేసేసింది. అతనెవరో క్రొత్త. మిలటరీనుంచి దిగేడు. ఆ వూళ్లో కొన్నిరోజులున్నాడు. అతనిదివరకట్నుంచీ, గంగులు నెఱుగును. గంగులు ఊరే తనదీనీ!

పోతురాజు ఆ వివరాలన్నీ సాధించేడు. ఓ ఏభైరూపాయలు, కమ్మలు తాకట్టుపెట్టి తెచ్చి, రైల్లో ఎక్కాడు.

అదొక చిన్న పట్టణం. దానికి దగ్గరలో ఒక పల్లె. ఆ పల్లెలో ఉంటున్నారని తెలిసి, అక్కడికెళ్లేడు. ఏం మొగం పెట్టుకుని దాన్ని రమ్మని అడుగుదామనుకున్నాడో?

ఆ మాలపల్లిలో అడుగుపెట్టేడు. ఫలానా, ఫలానా, ఇదీ సంగతి ఇక్కడున్నాడా?

గుడిసెల్లోవాళ్లు పోతురాజునిచూచి పకపక నవ్వేరు. నాలుగు చీవాట్లుపెట్టి పొమ్మన్నారు.

"ఎందుకొచ్చావయ్యా ఇక్కడికి; మతినేదూ? తుమ్మితే ఊడిపోయే ముక్కెంత కాలం వుంటుంది? నీ పిచ్చిగాని, అలా లేసిపోయిందాన్ని మళ్లీ ఎలా ఏలుకుంటావయ్యా? ఎంగిలికూడు! ఆ మిలిటరీవోడు అప్పుడే మకాం ఎత్తేసినోడు, రెండు రోజులుండి, ఎక్కడికెల్లిందీ తెలీదు. పిచ్చోడివిలాగున్నావ్. ఎప్పుడూ ఇలాగ బయల్దేరమాక" పోతురాజు అంతమంది నెదిరించి, కిక్కురుమనలేక, ఖాళీ చేతుల్తో గుడిసె చేరుకున్నాడు. ఇక మళ్ళీ గంగులుగురించి ప్రయత్నం చేయలేదు.

## 4

కాలం ముందుకు దూసుకుంటూ పోతోంది. పోతురాజు మనసు ముందుకు ఉరకలేస్తోంది పశుకామంతో. పాడు కొంపలన్నీ తొక్కి పాడుతోవ పట్టేడు. దురగడు కొడుకు విచ్చలవిడితనంచూచి మొత్తుకున్నాడు.

"మారుమనువుసేసుకోరాబాబూ సంపక"

"ఏం బాబూ! ఎవళ్లైనా ఇలాగేసేసి, ఏడుత్తారు. ఇల్లాగే పోనిద్దు బాబు."

"కూడూకుమ్మ ఎవరొండుతారు?" తండ్రి బలవంతంతో సరేలే" అని ఒప్పుకున్నాడు. నూరుమనువు 'కావేలమ్మ.' ఒక వందరూపాయ లిచ్చి తెచ్చుకున్నాడు.

తల్లిదండ్రులికి పిల్ల బరువై అమ్ముకుంటారు. అంతోయింతో డబ్బిచ్చి, మొగవాడు కొనితెచ్చుకొంటాడు. అంత పెట్టుబడి మగవాడిదే. ఈ మనువైనా అంత నిజాయితీ అయిందికాదు. తన మొగుడొదిలేస్తే, పోతురాజు బాహుల్లోకి వచ్చింది కావేలమ్మ.

వచ్చి ఆర్నెల్లు కాలేదుకాని, పోతురాజుతో అరవై తగువులు తెచ్చుకుంది. ప్రతీదానికీ మూతిబిగింపు. కోరిన కోరికలు తీరచకపోతే పోతానని బెదిరింపులు, అదలింపులు. 'దీనితో ఎలాగ చచ్చేది?' అనుకున్నాడు పోతురాజు.

కావేలమ్మని కూలికి నాలికి రమ్మంటే రాననేది.

"మీరిద్దరు మొగోళ్ళు తెత్తంటే నే కూడా ఎందుకంట"

అప్పటికి కావేలమ్మ చూపులు చూస్తుంటే

పోతురాజుకి వళ్లు మండిపోయి, చెమటంతా ఆవిరై పోయింది.

"నువ్వుగూడా దానినాగతన్నులుతింటవ్"

"కొడితేకొట్టు. నీయిట్టం. నే కాపరం సెయ్యలే నొక్కనిపుఁసం"

"కొమ్ములు తిరిగినయ్యే జాగర్త. వళ్లు దగ్గరుంచుకోని మసులుకో"

కావేలమ్మ వళ్లు దగ్గరగా ముడుచుకొని, ముసుగుదన్ని పడుకొంది.

"దీనిసంగతేటి! మాటాడితే పోతానంటది. ఇదివరకటోణ్ణిగురించి నా దగ్గర సెప్పద్దు. బుద్ధుందా ఏవన్నా? ఛీ! ఆడదాన్ని నమ్మగూడదెయ్. సుట్టకాలిసి, ఎఱ్ఱగా ఊది దాని కంటో తిప్పినా పాపం నేదు. మొగోడి తల ఎంత కట్టపడతన్నాడో ఎఱగక్కర లేదు. ఎప్పుడన్నా సల్లటిమాట ఇనబడద్దేమో అని సూసేను. అబ్బే! ఎప్పుడూ దాని తస్సాదియ్యా రుసరుసలే!"

కావేలమ్మనిగురించి పోతురాజు విరోధించాడు. 'పోతేపోయింది రేపే ఇంటికి తగిలేద్దాం' అనుకున్నాడు.

మర్నాడు కావేలమ్మను ఇదివరకు చేసుకున్న మొగుడొచ్చి 'కావేలమ్మని తిరిగి ఏలుకుంటా తీసుకుపోతా' నన్నాడు. కావేలమ్మక్కూడా ఇష్టమయింది అదేవిటో గాని. పోతురాజు ఏలి (ఆలి) నాటి శని వదిలిపోయినట్టు భావించి పొమ్మన్నాడు. కావేలమ్మ పాతమొగుడితోకలిసి చక్కాపోయింది.

"పసువుల్లా సంచరితన్నాం. ఆడోదిలేత్తే ఈడు. ఈడోదిలేత్తే ఆడు" అన్నాడు పోతురాజు.

దురగడు మారుమనువుకూడా చెడిపోయినందుకు నొచ్చుకున్నాడు. ఇంటికో ఆడదన్నా లేకపోతే ఎలాగుంటది? సిన్నబోయి. ఆపదొండిన కూగు పులుసే మొగోడి గొంతులో దిగజారద్దు జావలాగ. పోతురాజుకు కాపరం చేసుకుంటున్న చెల్లెలొకర్తుంది. అందాక కూడూ కుమ్మా చేసి పెట్టడానికి దురగడు అల్లుడితో కూడా రావించాడు.

## 5

కాలం ముందుకు నెట్టుకుపోతుంది. ఒక సంవత్సరం వనకాల ఒక సంవత్సరం నాటకాలాడాయి. దురగడొకనాడు తీరుబడిగా ఆలోచనతో అన్నాడు.

"ఒరేయ్! అబ్బాయీ! నువ్వు పెళ్లి సేసుకోపోతే మన వొంసం, కొలం నిలబెట్టేవురా? మంతోనే ఈ గిరిజాలోళ్ల వొంసం అంతమయ్యేటట్టుంది. ఎల్లాగయినా నీ సత్తువుమీనే ఆధారపడుంది."

పోతురాజుకు పెళ్లిళ్ల సరదా ఉంది గాని, "ఏడు రోజులు కాపరంసేసి, ఎగ్గొట్టేత్తారు ఎదవలు" అని వెనుకంజ వేస్తున్నాడు.

దురగడి బలవంతంమీద మారుమనువు చేసుకోక తప్పలేదు పోతురాజుకి. దూరపు సంబంధాన్నే ఎన్నుకున్నారు. చీటికి మాటికి ఎగిరిపోతా ననకుండా.

ఈ సూడో మనువు బంగారమ్మ. అంతబాగాలేక వళ్లంతా చీకట్లాగున్నా చేసేసుకున్నాడు. దీని అందాని కెవరూ ఆశించరు. తనకు శాశ్వతంగా నిలబడుతుంది. భర్తకుడు సరకుమీద గ్యారంటీ ఇచ్చినట్టుంది ఈ మనువు. దూరసంబంధంలో మంచి ఉంది. తనవాళ్లయితే దూరంగా వుండడంవల్ల పారిపోడానికి తేలిగ్గాదు. కాని వాళ్లవుతే కక్షలూ, కలహాలు లేకుండా సంబంధంసాగి, అభిప్రాయం అభిమానం ఉండొచ్చు. అందుకే నేను చేసుకున్నా ననుకున్నాడు పోతురాజు. బంగారమ్మ బంగారం కాకపోయినా, కనీసం ఇనుమైనా అనుకోకతప్పదు.

ఈ మనువు స్థిరంగా నిలబడుతుందని పోతురాజు గట్టిగా నమ్మకున్నాడు. అలాగ చేయించి, చూడమని 'సత్తెమ్మతల్లికి బలిసిన కోడిపుంజును బలిచ్చి, ఉపహారం పెట్టుకున్నాడు.

పోతురాజుకి కాలం కలిసొచ్చి, ఒక పొలంలో పాలికొప్పుకింద కుదిరేడు. దురగడింకా చచ్చిపోకుండా, కూలిపనికి పోతున్నాడు. బంగారమ్మకు లేచిపోయే స్త్రీ సాహసం లేక పోతురాజు బలమైన బాహువుల్లోనే చిక్కుకుంది.

ఒక సంవత్సరంలో దురగడి 'గిరిజాలోరి' 'వొంసం' నిలబెట్టడానికి, ఒక మొలక పుటింది.





# జంతువులు-పక్షులు

(4-వ పేజీ తరువాయి)

రకరకాలుగా ఉంటాయి. కొన్ని ఎప్పుడూ క్రూరంగానే వుంటాయి. కొన్ని ఆకలిగా వున్నప్పుడే క్రూరంగా ఉంటాయి. చెన్నపట్నం ప్రదర్శనశాలలో వున్న మేరీ, ఫ్రాంక్ అనే రెండు పులులు సాధారణంగా సాధువుగానే వుంటాయి; అప్పుడప్పుడు ప్రదర్శనశాల బంట్రోతులు, ఇతరులు వాటిని ముట్టుకొని ఆడిస్తారు కూడాను; అయితే వాటిని ఎల్లవేళలా నమ్మి ఊరుకోవటం క్షేమం కాదనుకోండి.

పులులు సింహాలకంటే శౌర్యం, చురుకుదనం గలవి; వీటిఅరుపు గాండ్రుమన్నట్టు దీర్ఘంగా వినిపిస్తుంది. వేటాడేటప్పుడొక రకంగా ఆడపులిని చూసినప్పుడొక మారిగా, కోపంలో వున్నప్పుడింకో రకంగా గాండ్రిస్తాయి. ఆడపులి గర్భధారణ కాలం 98 నుండి 110 రోజులు. ఒకోసారికి రెండు మూడు పిల్లలను పెడతాయి. పన్నెండునుండి ఇరవై ఒక్కఏళ్ల వరకూ బ్రతుకుతాయి.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras.



నేషనల్ గాలరీ (అమెరికా)లోని ఒక చిత్తరువు

ప్రసిద్ధ ఫ్రెంచి నవలాకారుడు

అలెగ్జాండర్ డ్యూమా

రచించిన

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

మొదటిభాగం

త్వరలో వెలువడనున్నది (రెండవ భాగం)

అనువాదం

సూరంపూడి సీతారామ్

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికనుండి పునర్ముద్రితము.

**వెల : మూడున్నర రూపాయలు**

---

ప్రకాశకులు:

ఆంధ్రగ్రంథమాల,

మద్రాసు 1.